శ్రీ

# ప్రబంధనాయికలు

గ్రంథకర్త:

'సరస్వతీపుత్ర' పుట్టపర్తి నారాయణాచార్యులు



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1954

శ్రీ ప్రొద్దుటూరు కన్యకాపరమేశ్వరికి

సమర్పితము.

# విషయసూచిక.

# ఉపోద్ఘాతము.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు ఇదివఱకే ఆంధ్ర సాహిత్యపీథులలో సుగృహీతనామధేయుఁడు, ప్రాత కొత్త తీరుతియ్యముల మెఱుఁగులు రెండును సమానముగా మెదిగి తయారైనజీవితము. సంస్కృతము, తెలుఁగు, ప్రాకృతము, ఆంగ్లము, హిందీ- ఈ భాషాకవుల, విమర్శకుల రాచబాటలలో స్వచ్ఛందసంచారము చేసిన-చేయుచున్నవాఁడు. కవిగా, విమర్శకుఁడుగా, వయస్సు చిన్నదయ్యును పెద్దయశస్సునకు స్వతంత్రముగా, పునాది, భద్రముగా వేసికొన్నవాఁడు. ఈయన గ్రంథమునకు ఇతరుల యుపోద్ఘాతమక్కఱలేదు. కాని నాకు వ్రాయక తప్పినదికాదు. కారణము: నాకు మిత్త్రుఁడు; మిత్త్రునికొమారుఁడు; మీఁదు మిక్కిలినా భార్యవైపున బంధువు. మఱి యితని కోరికను త్రోసివేయు దారి యేది?

కావ్యనాటకాదులను శాస్త్రీయమగు పారిభాషిక దృష్టితో చూచి తూఁచుట యొకదారి; దానియందు తెలిసియో తెలియకయో ప్రతిబింబించిన ఆయాకాలపు సాంఘిక రాజకీయాది విషయముల నెఱుఁగు కంటితో మూలముట్టుగ పరిశోధించుట రెండవదారి; ఇవిగాక గ్రంథకర్తయొక్క ఆశలు •

అభిమానములు, రాగద్వేషములు మొదలగు జీవనసూత్రము లను గమనించి, వాని యావిష్కరణపద్ధతులు అందుచే మన హృదయమందుఁ గలుగు సంవాద వివాదములును బైలుపఱు చుట మూఁడవది. మొదటి రెండుమార్గములును, ఎంత యుప యోగకరములైనను గుమాస్తాపనికి చేరినవి; విషయ సంగ్ర హము మాత్రమే. మూఁడవది అనుభవసంగ్రహము; కనుక ఇందులో ధైర్యము, జవాబ్దారీయు ఎక్కువ. ఇట్టి విమర్శము, ఒక్క కావ్యమును విషయీకరించుకొని వ్రాసిన వేఱొక కావ్య మనవచ్చును. ఇట్టి రచనలకు తెలుఁగులో దారితీసినవారిలో అగ్రేసరులు నే నెఱిఁగినంతవఱకు శ్రీకట్టమంచి రామలింగారెడ్డి గారే.

ఈ 'ప్రబంధనాయికలు' పైతరగతికి చేరిన విమర్శ కావ్యము. శ్రీకృష్ణదేవరాయల సాహితీసర్వభూమిని మోచు కొన్న అష్టదిగ్గజములలోని మహత్తర గజములగు పెద్దన, తిమ్మన, సూరన్న, మూర్తి - వీరు సృజించిన నలుగురు ప్రధాన నాయికల తీర్పును గుఱించినది. దానినిగూర్చి యీ గ్రంథ కర్త యిచ్చిన తీర్మానము కొంతవఱకు హేతువాదపు ఫల మైనను ముఖ్యముగా రసనాదము నాశ్రయించినది. ఆయన రుచుల స్వరూపమును ముఖ్యముగా తెల్పును. ఇట్టి విమర్శ ములను గూర్చియే 'ప్రతివిమర్శనమును ఒక ఆత్మకథ' 'Every criticism is an auto biography' అను మాట పుట్టినది. ఇది

శాస్త్రముగాదు; చర్వణము. బంధముగాదు. బ్రదుకు. కాఁబట్టియే కీ॥ శే॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారివంటి వారికిని నారాయణాచార్యులవంటివారికిని సామానాధికరణ్యము ఎన్నటికిని కుదురదు. బ్రహ్మయ్యగారు మనుచరిత్రలోని వరూధిని బ్రదుకు రసాభాసము గావున నీచమనిరి. రసాభాసమనునది పేరు మాత్రమే కాని రసత్వమున కందు లోపము లేదని యీ గ్రంథకర్త తలఁచెను. 'సర్వేసి రసనాద్రసాః' అన్న విశ్వనాథపంచాననునివంటి లాక్షణికుల వాక్యములుగూడ గమనింపరు శాస్త్రిగారు! కాఁబట్టి యిట్టి విరుద్ధమార్గదర్శకులగు విమర్శకు లిద్దఱుఁ గలిసి కలహామునకు దొరకొనిరేని, అదికంఠశోషలోనే ముగియవలసినదే తప్ప వేఱుఫలము గానరాదు.

నారాయణాచార్యులవాక్కు వణఁకు లేనిది. స్వతంత్రమగు భావనాబలము; తీవ్రములైన భావములు. అడఁకువలేని యభిప్రాయములు. అనుభవశూరుల లక్షణములన్నియు నిందుఁ గలవు. తోఁచిన పొగడ్తనుగాని తెగడ్తనుగాని వెనుదీయక విసరి చెప్పు నార్జవ మీతనికిఁ గలదు. ముఖస్తుతిగాని, ముఖనింద గాని విద్యగా నేర్చిన పాతకమునఁ బోనివాఁడు అనుభవమునకు మితి, లోపము ఉండవచ్చును. కాని అది ఆరోపితముమాత్రము కాదు; భావోద్రేకముతో కావేరివలె ఇతని వాగ్ధార తెగదూఁకులు దూఁకుచుండును. ఆ వేగములో కొన్ని యభిప్రాయ

ములు అందదుకులుగాఁ గానరావచ్చును. కొన్ని మాటలు కొంత కఠినముగా దొరలవచ్చును. కాని వానికి కారణము చారుదత్తుఁడు చెప్పినట్లు, 'యౌవన మత్రాపరాధ్యతి, నచారిత్రమ్. (మృచ్ఛకటిక).

ఇటీవల సాహిత్యము బ్రదుకునుండి బైటఁబడి ఉపన్యాస వేదికలకును, ఉపాధ్యాయపీఠములకును అంటుకొని యాత్ర గడపుచున్నది. మఱల దానిని నిత్యజీవితముతో మేళగించి స్వాతంత్ర్యానుభవత్వమును ప్రసాదించునట్లు చేసికొనమేని బ్రదుకులో బండతనము తప్ప మఱేమియు మిగులకపోవును. ఈ వ్యాసములవంటి రచన లట్టి పునరుజ్జీవనమునకు చాల తోడుపడు ననుట నిస్సంశయము.

ఈ గ్రంథకర్తల కలమునుండి ఇట్టి వ్యాసము లింకను పెక్కులు వెలువడునని యాశించుచున్నాను.

వృష, పుష్య, శుక్ల ౧౧ }
మైసూరు. } రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.



# ప్రబంధ నాయికలు.

## గిరిక.

---

అల్లసానివారి యల్లిక లాంధ్రభోజునిచే నందలముం బట్టించుకొనునాఁటికి రామరాజభూషణుం డొక కొంటె విద్యార్థి. కవితాపితామహుఁడు తూగు టుయ్యేలపైఁ గూర్చుండి, యలవోకసూఁగుచు రాయల నధిక్షేపించుటయు, కొలువుకూటమున "చతుర్వేశ్యాభుజంగుఁడు" తాతగారికి స్వయముగా గండపెండెరముఁ దొడుఁగుటయు నంతకుముందే గడచినగాథలు. మూర్తికవికిఁ జిననాఁడే యీకథలు చెవులకెక్కి యుండును. పాండిత్యము పచ్చిపొగరుతో నప్పుడే పితామహుని 'శిరీషకుసుమపేశల సుధామయోక్తులతో' నున్న వరూధినినిఁ గాంచి నాలుఁగులొట్టలు వైచియుండును. తాను పెద్దవాఁడై గ్రంథములు వ్రాయునాఁడు పూలగుత్తులఁబోలు కవితల విరియించి సాహితీసేవకు లగు విజయనగరరాజులను పల్లకీబోయలుగాఁ గాదు-పంచకాపరులఁగా నేలఁదలఁచినాఁడు.

కాలము జర్రనఁ దిరిగినది. మూర్తికవియుఁ బెద్దవాఁడైనాఁడు. సంపూర్ణముగ విద్దెల నేర్చుకొన్నాఁడు. ఆలంకారిక రాద్ధాంతముల మననఁ గావించినాఁడు. వ్యాకరణ సూత్రముల నెముకలరుగ వల్లించినాఁడు. శ్రుతిస్మృతులు శోధించినాఁడు. మూర్తికవి వీథులఁ బోవుచున్నపుడు వేదములవల్లించు ఛాందసులు వెఱపున నాపుచుండిరఁట. సాహిత్యమునకుఁదోడు సంగీతమునుఁ గడముట్ట శోధించి సరస్వతీదేవి రెండుచన్నులపాలు మనసారఁ గ్రోలి రుచిభేదము లేర్పరుచుకొన్నాఁడు. సర్వవిధముల గడుసరి మనకవి.

ఆకాలమునఁ బండితులకును, కవులకును నంతగా భేదము పాటించువా రరుదు. చాలవరకుఁ బండితుఁడే కవి యను నియమమును నానాఁడు లేకపోలేదు. ఇప్పటివలె శ్లోకము నర్థముఁజేసికొని యానందించుటతో నప్పటిసాహిత్యము ముగియుచుండలేదు. దానిపైఁ బండితులు ద్రవ్వియెత్తు శాస్త్రీయ పూర్వపక్షములకు సమాధాన మీయవలసియుండెను. అలంకారికవివాదములఁ బరిష్కరించి వారికడుపు నింపవలెను. శాస్త్రీయబలములేనిది యాకాలమునఁ బేరువెలయించుట దుర్ఘటముగ నుండెను.

అప్పటి కవులలో శాస్త్రశూన్యు లెవ్వరుఁ గానరారు. రామలింగని పాండురంగమాహాత్మ్యమున ముఖ్యముగాఁ దర్కపటిమ, యల్లసానివారిలో సకలశాస్త్రమర్యాదలు పొడఁగట్టుచునేయున్నవి. కడకు కేవల తత్త్వోపాసియగు సూరనా

ర్యునకును నావేళ నాలుగు మీమాంసాన్యాయములు వెద చల్లనిది కూడుపుట్టినది గాదు. అసలు రాజులును నలసులుగారు. రాయలే రచించిన యాముక్తమాల్యదయే యతని వివిధశాస్త్ర పారంగతత్వమును దెలుపుచున్నది. తిరుమలరాయని గీతగోవింద వ్యాఖ్య జగద్విదితమే. ఆఁతడే రచించిన శాకుంతలవ్యాఖ్యయు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నెందో మూల్గుచున్న దఁట!

ఇఁక మనకవి గడుసరియేగాక మాటపసయును గలవాఁడు. తాను జదివిన శాస్త్రములపై సంపూర్ణాభిమానముగల ప్రోఁడ. అందులకే పాపము తాను సృష్టించిన పరమాణుమధ్యకును (౩-౬౮-౮) పటుశాస్త్ర శ్రేణికాభ్యాసము (౩.౧౦౦) దప్పినది గాదు. పలుమారు "నానాకళాపారీణుఁ" డగు "శ్రీరామక్షితిపు"ని మెప్పించి "రత్నహారహయవేదండాగ్రహారాదులు" మరి యాద లందినవాఁడు. ఎటుల మెప్పించుటని! శాస్త్రములే. "సాహిత్యపోషణుం" డనియు, "సంగీతకళారహస్యనిధి" యనియు తప్పెటవేసి మెరమణి దిరిగినాఁడుగదా!

భూషణుఁడు సాహిత్యమును, శాస్త్రమునుఁ జేతఁబట్టు కొని సవ్యసాచియై సభలలో హుంకరించుచున్నను చిననాఁటి గాథలు మరువలేదు. బిరుసుమీసముల యౌవనములో, మాటఁ దీర్చికొని తాతను రమ్మని సవాలుచేసినాఁడు. సర్వవిధములఁ

దనది వైఁచేయియని మురిసిపోయినాఁడు. కాని, పాపము అంద లముఁ బట్టించుకొను భాగ్యము మాత్రము నోచుకోలేదు. కారణమేమి? కలదు. నిశ్చయముగాఁ గలదు.

మను, వసుచరిత్రలలోని వస్తువు సమానమే. చూడఁగా వస్తువున కాదర్శముగాఁ దాతగారిచే యుంచుకొన్నట్లున్నది. అక్కడికోన, యక్కడిచానదే యిందును గోచరించుచున్నవి. ఇరువురనుఁ బెనుగొండఁ జూచినవారే కనుక వా రిరువురి కవిత్వమందును "జటిలద్రాక్షాగుళుచ్ఛము"లే తనివిదీర తను పారి మెండుకొన్నవి. ఇంకను భూషణుని పలుకులలో "దాడిమీ బీజసంతతియు" విరిసి తళతళ మన్నది. వస్తువున కింకను మెఱుఁ గులు వేయఁబోయి వెల్లకిలఁ బడినాఁడు. ప్రాణము పెద్దన్నది; భూషణములు సాహిత్యపోషణునివి; చిత్ర మలసానివారిది; రంగులు దిద్దు బాధ్యతమాత్రమే యీతనిది. భట్టుమూర్తియే సహృదయుఁడై "కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము" లని తన కంసాలితనము నొప్పుకొన్నాఁడు పాపము!

భూషణకవి చదికిలఁ బడుటలో నొక కారణమున్నది. అతఁడు నేయఁబూనినది యసాధారణమగు కుస్తీలపట్టు. కావ్య మంతయు శ్లేషమయము గావించునూహతో, అయ్యో! సుకుమారి గిరికను రాతిరప్పలకుఁ బుట్టఁజేయు పాపమున కోర్చి నాఁడు. కాకున్న, కవులు సంపూర్తిగ స్వాతంత్ర్యము వహించు

నాకాలమున నిలివృత్త మేరీతి మార్చియున్నను "యిదేమని" ప్రశ్నించియుండరుగదా! పాశ్చాత్యకవి "యొథెల్లో" నాటకమున పరమపవిత్రతయు, సుకుమారియునగు డెస్‌డిమోనాను క్రూరకిరాతుని కంటఁగట్టి విపరీతసృష్టి గావించి పాఠకుల మనస్సులనొంపఁ బ్రయత్నించినట్లు భట్టుమూర్తియు నొకక్రొత్త పోకడఁ బోయి "ఛీ" యనిపించుకొనఁ దలఁచెను.

మనుచరిత్రమునఁ దొలుత ప్రవరవృత్తాంత మున్నది. విప్రుని నైష్ఠికత-కూకటులు గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ చెలిమి పెంపు-బ్రాహ్మణుని తీర్థయాత్రోత్సుకత-సిద్ధాగమనము-హిమగిరిప్రయాణముతో ప్రథమాంకము ముగియుచున్నది. వసుచరిత్రమునందును తొలుత నధిష్ఠానపురవర్ణనతోఁ బ్రారంభించి వనవిహారముతో ముగించినాఁడు. రెంటియందును ద్వితీయాశ్వాసముననే నాయిక లరుదెంచుట. పెద్దన్న "మగువ పొలుపు మారుతము"తో సూచనఁ బ్రారంభించఁగా, మూర్తి "మాధురీధుర్యమగు" కలస్వనముతోఁ దెర యెత్తినాఁడు. వరూధినీగృహము చెంగలువలతోను, కేదారములతోను, మావులతోను, క్రోవులతోను నుండఁగాఁ జూచి మోహముఁ జెట్లించి, రత్నకోరకములను, లవలీలతలను బెంచి భట్టు ధన్యుఁడ నైతి ననుకొన్నాఁడు. ఈసన్నివేశమున వర్ణనమే కాక వృత్తములను సమజాతిలో నుండుట సాదృశ్యమునకుఁ జాల చేరువ.

కాఁగా గిరికను సమీపించుసరికి దృష్టిమారినది. వరూధిని జేల ; చమత్కారముగ మాటలాడఁగలదు. వింతతర్కములకు దిగి నెగ్గించుకొను ధీర గాదు. మనసు లేఁత, మమత గొప్పది. చిననాఁటినుండి సౌందర్యమునకు, సహృదయతకుఁ బేసుగన్న యచ్చరలచిన్నది యగుట "నొంటిపాటునఁ దంగెటి జున్నుకైవడిఁ" గంటఁబడిన విప్రునిఁ జూచి వలచి తనహృదయ మిచ్చినది. పలురీతులఁ దనకుఁ దెలిసిన సత్యమును, జిలుకపలుకులవలె, సొయ్యారముగాఁ జెప్పినది. స్వర్గమున నినుపకచ్చడాలు ప్రేలాడ, నచ్చరలవెంటఁబోవు తరుణతాపసులఁజూచి నవ్వుకొన్నది గదా! విప్రుఁడో నైష్ఠికుఁడు. తనధర్మము, తనత్యాగమే తప్ప మరేదియు నెఱుఁగఁడు. ఛాందసుఁడుగాఁడు. వరూధిని యెట్లు కళాస్వరూపముగ మనకుగోచరించుచున్నదో విప్రుఁడు నదేరీతి శాస్త్రమువలె గంభీరుఁడై పొడసూపును. అందులోని సౌందర్య మిందులో రాదు. ఇందలి గభీరత యందులో లేదు. రెండును విభిన్నములగు, సముచితములగు త్రోవలు. పెద్దన్నకు రెంటను బక్షపాతము గలదు. ఆ మహామహుఁ డొసగిన యర్థాంతరన్యాసమే యాతని మధ్యవర్తిత్వమును జాటుచున్నది. "కలంచునే సతులమాయల్ ధీరచిత్తమ్ములన్" అని సునాయాసముగ వరూధినివైపువంగు మన హృదయముల కెచ్చరిక నిచ్చినాఁడు కవి. వరూధినియు నపవిత్ర గాదు.

విప్రుఁడును హేతువాదములకు దిగునప్పటికి మొగమువంచి యేడ్చినది వరూథిని. దయాభిక్ష యాచించినది. బలవంతమున మీఁదఁబడ్డది. నిరాదరణకుఁ బ్రతికృతిగాఁ గంట దడిపెట్టినది. హృదయమిచ్చినది. వడ్డీతో గ్రహించలేకపోయినది. ఫ్రౌఢిఁ బలికింపఁగలదు. తన యాలాపమునకు తానే సొక్కు తన్మయ హృదయ. ఇంపుదళుకొత్తవాయించును. సారించిననాదము సరియా కాదా యనున దామెపనికాదు. కేవల రసోపాసిని, యభాగ్యజీవిని!

గిరిక యట్టిముగ్ధ గాదు, విదగ్ధ. చమత్కారముగ మాట లాడుటయే కాదు. చెప్పినది యొప్పించఁగలదు. పైపైని తేలఁ బలుకదు. గంభీరముగ హృదయమునాన్చి తలజిల్లు దిరుగఁ జేయును. గడుసరి నేతకుఁ బ్రతినేత నేయుటయే కాక మెఱుఁగు పెట్టినట్లు గావించు ప్రౌఢ. రతిసమయమున వసురాజుతోఁ దానునేర్చిన సాహిత్యవిద్యను ధ్వనివ్యక్తితోఁ బ్రత్యుపదేశ మిచ్చినదఁట. (౬-౭౮) చిననాఁటినుండియు వసురాజుకీర్తిని విని, తనతల్లి కాతఁడు నేసిన యుపకారము మూలమున సుదాత్త గుణములఁ దలంచి, భావించి, ధ్యానించినది. అతనిఁ బెండ్లాడు నాసను బెంచికొని, ప్రౌఢిఁజేసినది. కాని యామె తొందరగా మనసును లయింపఁజేయునవశ గాదు. కాలమునకై వేచి యున్నది. సర్వవిధముల చమత్కారిణి గిరిక.

నాయిక మనుచరిత్రలోవలెనే వీణె వాయించుచు

హాయిగఁ గూర్చున్నది. జిలిబిలిపాట గాదుసుమా, శాస్త్రమునకు గుండెనిమిరి నీరుఁదట్టినది. 'ఘనవిద్యామహిమ ల్గరామలకము ల్గావించుకొన్నది' గదా మరి! ఆతోజును మూర్తి యీరీతి వర్ణించెను.

"వలుదగుబ్బలు ప్రసేవకవృత్తి దగుగుబ్బ
కాయల కపరంజిచాయ లొసఁగ
లలితాంగుళీదళంబులు సమేళములైన
సారెలపై రాగసంపద లిడ,
పాణికంకణరుతుల్ ప్రాణానుబంధమ్ము
గలతాళగతి కనుగ్రహములీన
నాలాపభంగి యవ్యక్తసంవాది స
మస్వరంబులకు గ్రామంబు లునుప
ప్రచురతానామృతముల మూర్ఛనలచే న
చేతనంబులు చేతనరీతిఁ దనర
చేతనంబుల లచేతనభాతి నొనర
వీణె వాయించు నొక యలివేణిఁ గంటి".

రామరాజభూషణుని సాధారణశైలి యిదియే యనవచ్చును. శ్రీనాథుఁడు నన్నయనుండి నేర్చిన విశుద్ధధారతో నాట్యము లాడెను. రామరాజభూషణుఁడా శ్రీనాథుని ధారాశుద్ధికే సంగీతమును జోడించి నృత్తములు ద్రొక్కించెను. మనుచరిత్రలోని పద్యమువలె నిందు పాఠకుని మదిని లోఁగొను బాహ్యస్వరూపమేమియు గోచరింపదు. ఆభ్యంత

రికమగు చంచలమనఃప్రవృత్తిని స్ఫుటీకరించు నలవాటు వీ రెవ రికిని తిక్కనవలె నబ్బలేదనుట పరమసత్యము. అల్లసాని వారిలో బాహ్యస్వరూపముచే నాంతరికమనోవృత్తి నూహిం చుకొనననైనను వీలుగలదు. దీనియం దాయవకాశమును గానము. సమగ్రముగ బాహ్యస్వరూపమునుగాని చిత్రించు ప్రతిభయు మనలోఁ జాలమందికిఁ దక్కవు. ఉపమానములు పరస్పరసంబంధము లేనివి, ఒకటికొకటి పొసగనివి వాడుట, స్వభావమునకు దూరముగఁ జిత్రించుట మనకవుల ఛాందస మునకుఁ జేరిన పొరపాటులు. ధ్వనికారుఁడు "అపారేఽస్మిన్ కావ్యసంసారే కాళిదాస ప్రభృతయోద్విత్రాః పంచషా వా మహాకవయో భవంతి" అన్నమాటకు సరిగా నెవరో కొంతమందియే యీ యరిష్టములకుఁ దొలఁగి నిలిచిరి.

కాన మనకు చాలమంది కవులు వర్ణించినదానిలో సంపూర్ణత యున్నదా యనుప్రశ్న కవకాశములేక వర్ణించినవి హృద్యములా యని యడుగునంతటి యధికారమే మిగిలినది. కారణములు కొల్లలు.

పై రామరాజభూషణుని పద్యమున శాస్త్రప్రాధా న్యము కళకన్నను ముందు త్రోసికొనివచ్చినది. విసంవాది సంవాది స్వరముల మూర్ఛనలు గ్రామములు మొదలగున వన్నియు సంగీతశాస్త్రవీథులలోని సరకులే. కేవల సహృ దయులకుఁ బనికివచ్చున దిందొకటియే. "చేతనము లచేతన

ములరీతి నుండుట, అచేతనములు చేతనరీతి నవుట." అది యును జాల లావుమాటయై మనస్సు నాఘూర్ణితమొనర్చు చున్నది. మనసారఁ దల్లి పెట్టు భోజనమువలెఁగాక కోపముఁ గొన్న పెంకెపెండ్లాము విసరిన వడ్డింపువలె మనస్సునకు ప్రేకఁదనముఁ గొలుపుచున్నది. కవితావాక్చమత్కృతి ముందు నిలిచినది.

పాపము! చిన్ననాఁటినుండియు మణులు వెచ్చించి నేర్చిన విద్దెగదా! ఇంతమాత్రము సేయలేదా! యని సరిపెట్టు కొందమన్నను నడుమఁ బఠించిన నిఘంటువు మనల నా ప్రపంచము నుండియే తప్పించుచున్నది. వసురాజానంద బ్రహ్మము నెట్లనుభవించెనో గాని పాఠకులకుమాత్రము విసుఁగు దప్ప మరేదియుఁ గలుగదు. సంగీతకళారహస్యనిధిత్వములో శాశ్వతానందము వలసఁబోయినది.

అసలు వరూధినికి గిరికకును వయోభేదము చాలఁ గలదు. వరూధిని గిరికకన్న నైదారేండ్లు చిన్నదిగావచ్చును. లేనడుము, మీాటిన విచ్చు గుబ్బచనుమిట్టలు, అల్లలనాడు తుఱుము, సెలవివారవెడలు నవ్వులు. అతిమనోహారిణి. అపుడపుడ శృంగారప్రపంచమున నడుగిడిన క్రొంగ్రొత్త కన్నె. అందుల కనుగుణమగు చాపల్యము, త్రోసికొనివచ్చు లజ్జ, సౌందర్య పక్షపాతము, ముందువెనుక లరయలేని ముగ్ధత, వికలత, లేఁతమనసు మెఱపులవలె మెరసిపోవు

చున్నవి. సర్వవిధముల మానవకాంత వరూధిని.

ఇఁక గిరికయన్ననో, కవి ఆమె సమంజసరూపమును మనకుఁ బట్టియీయలేదు. ప్రపంచ ప్రసిద్ధములగు నుపమానములన్నియుఁ గుప్పించినాఁడు. స్తనములు కుంభములై, పూర్ణకలశములై, గుండులై, బండలై, కడకుఁ గొండలైనవి. జఘన మచలాభోగత నలవరించుకొన్నది. హస్తములు తామరతూండ్లు. మధ్యము పరమాణువు. ఒక నియతస్వరూపము లేదు. పద్యపద్యమున కామరూపిణివలె గిరిక మారుచున్నది. కవి వర్ణించినరీతి బొమ్మను గీచినచో, పేరుగన్న పెద్దమ్మగాఁ దయారగునేకాని కడకు స్త్రీరూపమునైనను మనము చూడలేము. ప్రబంధకవులకుఁ బట్టిన ఛాందస మితనికిఁ బూర్తిగాఁ బట్టినది. కనుక బాహ్యస్వరూపమునుబట్టి నిర్ణయించుటకన్న నాంతరిక మనఃపరిపాకమును బట్టి సమన్వయించుట న్యాయమగును.

గిరికకన్నె ముగుద గాదు. సిగ్గును ద్రోసికొని యభిలాషముందుపడి పండి ఫలించినది. వసురాజుకన్న తానే ముందయి 'నవలాలిత దృష్టిజాలముల' బఱపినది. హృదయమును విప్పిచూపినది. ఆమెచేతలలో ప్రౌఢి యున్నది. మాటలలో గభీరతరమగు ధ్వనియున్నది. తలఁపునుబట్టి యిచ్చు యొయ్యారమున నెఱజాణతనమున్నది. వరూధిని లోని యీషత్ఫుల్లమగు నగ్నసౌందర్యము గిరికాదేవియందు

చిపురతో తుమ్మెదలతో సర్వాంగీణశోభితముగ నున్నది. వరూథిని జగమును మించు సౌందర్యము నంగములలో వడ బోసికొన్నను నమ్మకములేక యూఁగుచున్నది. గిరిక కంతటి మహోన్నతసౌందర్యములేకున్నను ముందుపడి ప్రపంచ ముతో ఢీకొనుచున్నది. సర్వవిధముల తనుపారిన ప్రౌఢ గిరిక. నిగనిగలాడు యౌవనము పూర్తిగాఁ బండినది. వరూథిని కల్లనల్ల 'ఇంపుదళుకొత్త' వ్యాపించుచున్నది.

వసురాజుతలఁపును గిరిక హృదయమునుగన్న మంజు వాణి, కుంటెనకత్తె, పాటను చల్లగాఁ బ్రారంభించినది. వసు చరిత్రకారుఁడు ముఖ్యముగాఁ జెఱచిన పాత్రములలో మంజు వాణి యొకతె. లజ్జాభిమానములుగాని, మరి యే స్త్రీ గుణములుగాని లేని శుష్కప్రతిమగా కవి యామెను మన ముందు నిలిపినాఁడు. మాయామునితోడి సంభాషణము కేవలము నింద్యముగా నున్నది. మరియాదగల మగువ భాషించు తీరున లేదు. ఇట గిరిక వర్తనమును సముచితమని వచించు ధైర్యము మాకు లేదు. ముగ్ధయైనను, ప్రౌఢయైనను, దేవకాంతయైనను, మనుష్యకాంతయైనను, సిగ్గు స్త్రీలకు పరమపవిత్రమైన వస్తువు. దశాభేదములచే తత్పరిమాణమున భేద ముండవచ్చును. మంజువాణి మునుకొని పురుషునెదుట కోలాహలుని వలపును విస్తరించి యుపన్యసించునపుడు హాయిగాఁ గూర్చొని వినుచుండుట యేటిపాడి? అట్లైవార్ష

ప్రపంచమున నుండవచ్చును. వారు కులశీలసమన్విత లనియు, ఉత్తమనాయిక లనియుఁ జెప్పజాలము. వారు విశ్వామిత్రుని యపూర్వసృష్టిలోనివారే. మనగ్రంథములు స్వభావతను గాదు జిత్రించునది, దానియందున్న యుత్తమత్వమును.

మంజువాణి చతుర్థాశ్వాసమున రాజును దర్శించినపుడు గావించిన హాస్యమున చమత్కృతి గలదు గాని సందర్భ శుద్ధియు, నైక్యమును లేవు. ఆమాటఁ బలికించుటకై కథ యనుగతత్వమునకు విఱుపు కలిగినది.

శాకుంతలనాటకమున నున్న యనసూయ నాదర్శ ముగాఁ గొని మంజువాణి కింకను మెఱుఁగుదిద్దఁబోయినాఁడు కవి. కాని కడకు మంజువాణి క్రోతిపిల్లగాఁ దయారైనది. శాకుంతలమున ననసూయ శకుంతలాజన్మవృత్తాంతమును వివరించి చెప్పుచు మేనకా విశ్వామిత్రుల కలయికను దెలుపఁ బోయి పొరఁబడినదానివలె నర్థోక్తిలో నాలుకఁగొఱికి నిలిపి వేయును. ఉచితజ్ఞుఁడగు దుష్యంతుఁడును "పరస్తా దవగమ్యత ఏవ" అని యనసూయాతల్లి శీలమునకు మాగధునితనముఁ గావించుచున్నాఁడు. మనమంజువాణియో అట్టి యవకాశము నీయలేదు. మాయామునిఁ దీసికొనుటకు సిద్ధముగ నుండ లేదు. తూ-చా- తప్పక పూసఁగ్రుచ్చినట్లు యాదినుండి యం తమువఱకు చక్కఁగా విస్తరించి చెప్పుచున్నది. ఆవర్ణించు ఘట్టమును జూడుఁడు.

"అలముకొని చెంగల్వతావులు సెదరవేణిఁ దెమ లించుచు, మకరికలు మలయగండపాళి నొక్కుచు మధురామృతంబులు వడియంబలు దెర సొబఁగులొనుచు, మౌక్తికంబులు జడియం బయోధరంబులు బట్టుచు విశదాంశుకాంతిస్థితి దొరఁగ నతివిపుల పులినజఘనారోహంబుల నుత్పలపత్రంబులు నెఱపుచు."

తనివిలేక పోరాడినాఁడఁట. ఇందులో నడుము, జఘనములు, పయోధరములు కొల్లలు. ఇది యేటియౌచిత్యము ? మునులసన్నిధి నీరీతిఁ బలుకుటయు, వారును చెవులు దెరచి వినుటయు నసభ్యతగదా ! రామరాజభూషణుఁడు తన శ్లేషపాండిత్యము వెల్లివిరియించు పీరావేశమున నౌచిత్యము నేమాత్రమైనను గ్రహించెనా ? రసపరిపక్వ బుద్ధులకేల సామాన్యులకైనను మనసు విసిగించునదిగాదా యీఘుట్టము ? చూడఁగా మంజువాణిపాత్ర కావ్యమునకు పుండు. భట్టుమూర్తి దృష్టిబొమ్మగాఁ నామెను దయారుచేసినాఁడేమో యనిపించును.

ఇంతలో విఱిచినాఁడు ఘట్టమును. ఈదృశ్యకావ్యనియమము నిందతికించుట బాగుగనేయున్నది. భూషణకవి సాహిత్యపారంగతుఁ డగుటచే నిట్టియద్భుతముల నేర్చెను. కాని ఫలముమాత్రము కవియనుకొన్నంత రాలేదు. మహాకవి శాకుంతలమున రెండుచోట్ల నిట్టిఘట్టమును దెచ్చెను.

మొదటిది వనగజవృత్తాంతము. దుష్యంతుఁడు వేటకై వచ్చి యుండుటయు, సైనికులు మృగములఁ దరుముచుండుటయు, నవి భయమునఁ జెలరేగుటయు కవి యింతకుమునుపే యక్కడక్కడ నలతిముక్కలలోఁ జెప్పియుండుటచే నీవృత్తాంతము సర్వవిధములఁ గారణములచే బలిష్ఠమైయున్నది. రెండవది మూఁడవయంకములోని గౌతమీప్రవేశము. అందులకు రెండవయంకములోను, మూఁడవదాని ప్రస్తావనలోను మహాకవి కారణములు నిర్వచించినాఁడు. మన వసుచరిత్రలోని కలహంసికప్రవేశమున కట్టి సందర్భశుద్ధి లేదు. చూడుఁడు

"ఆ కలహంసి వచ్చి యచ
లాత్మజఁ గాంచి కుమారి తాపసా
నీకము నీకమూల్యశుభ
నిర్వహణంబు ఘటిల్లఁ గల్పకా
నోకహసూనరాజము ల
నూన మృదూక్తులతో నొసంగినం
గైకొని తల్లి ని న్నిలువ
గాఁ బనిచెన్ విరు లిచ్చు వేడుకన్.

(౩-౭౨)

మును లెందు కదు రెంచిరి? అరుగు దెంచినవారు కోలాహలునిఁ జూడలే దేల? పూవులదినము నిచ్చుట వాడుకయా? ఇంతకుమును పిచ్చిరా? మొదలగుప్రశ్న లుదయించును. వానికి సమాధానములు:—— రాఁగూడదా, ఇవ్వఁగూడదా యను

సంభావనలుదప్ప వేరుకారణములు గానరావు. ఈ ఘట్టము లలోనే కొన్ని మహాకవి యడుగులలో నడచినఘట్టములు గలవు కాని, అవియన్నియు నిర్వాపితదీపములు.

వసురాజు వెడలిన వెంటనే కనుకలితన మారంభమైనది గిరికకు. వరుసగా మన్మథుఁడు దేశికుఁడై బోధింప మొదలిడినాఁడు. తొలుతఁ దదధీనమానసఁ గావించి, తరువాతఁ బ్రారంభించినాఁ డొజ్జలతనమునకు. ఆ శిక్షాప్రకారమును కవి యీరీతిఁ జెప్పినాఁడు.

> "లలనారత్నము నొయ్యనొయ్య బొటవ్రేలన్ నేల వ్రాయించి ని
> శ్చలవృత్తిన్ వరవర్ణపూర్ణ ఫలకాసంగంబు నొందించి మి
> న్కులు వేమారు తదర్థ చింతనలతో మాల్కొల్పి నెయ్యంపుటొ
> జ్జలు పైపై వెలయింపసాగె పటుశాస్త్రశ్రేణికాభ్యాసమున్."

ఇది యొక యపూర్వమగుపద్యము. ఇందు మూఁడువిధములగు సాధనల మూర్తికవి వివరించినాఁడు మొదట లజ్జావశమున నలసప్రవృత్తిని, రెండవదాన నాభ్యంతర మానసికోద్బోధమునకు హేతువగు బాహ్యేంద్రియవ్యాపారమును, మూఁడవచరణమున లాఘవాభ్యాసవశమునఁ గ్రమముగా మనోలయాభిముఖ్యమును దెలుపుచున్నాఁడు. ఇందలి "నెయ్యంపుటొజ్జలు" అనునది ధ్వని కమృతకలశమువంటిది. ఈపద్యమున నాతని పాండితిని, శ్లేషపటిమను మఱచిపోయి, సందర్భశుద్ధితో క్రమమువీడక సాధనల నతికించిన ప్రతిభను

'భలే' యనని రసికుఁ డుండునా?

ఇటనుండి తిన్నగా సంచారిభావములవైపును, తటస్థములగు మలయానిలాదులవైపు దారిఁజూపినాఁడు. మేధాశాలి యగు నీకవి యిందునను నొకపద్ధతిని, క్రమమును బాటించెనే కాని కళ్లములోని జొన్నలవలె కుప్పఁబోయలేదు. తొలుతఁ దమ్ములని పద్మములమాటునఁ జేరినది గిరిక. అవి ముస్నుస్ను యేచసాగినవి. అటనుండి వరుసగా నందఱుఁ బగవారైరి. నిరంతరము వసుధ్యానముననే మునిఁగి, చెలులతోఁ బలుకక, శుష్కించి యేడ్చి యేడ్చి సన్నగిల్లినది గిరిక. ఆమెచను గట్టుపై జారి, క్రిందఁబడిన కన్నీరు శుక్తిమతివలెఁ బారెనట (3-102). అసహాయ—యగు గిరికయా? కాదు—అను కొనుచున్న గిరిక యేకాంతమున నెన్నియోదినములు తపించినది. ఆయాలోచనములకు దివారాత్రములు గనఁబడ లేదు.

ఏమాలోచించినది గిరిక? కన్నీరు మున్నీరుగా నెందులకు విలపించినది? కారణము చాల చిన్నది, — వసురాజును బొందుట. ఈసమయమున నవకాశమును దొరకించుకొని నూఱుపద్యములవరకు వాడినాఁడు మూర్తి. అంతయు విరహ వర్ణన. వర్ణనపద్ధతి బాగుగా నున్నది. అలంకారశాస్త్రమున వడిదిరిగినబుద్ధి యగుటచే విభావాదులను క్రమముగా స్థాయికి నేరీతి నీడ్చుకొనిపోవలెనో, భావమననలో క్రమక్రమముగాఁ

బైపైని గలుగు వివిధానుభవము లేవియో సూటితప్పక వివరించినాఁడని చెప్పవచ్చును. ప్రతియొకదానియందును శ్లేష. తనంతఁ బ్రతియొక్కటియు రమణీయమే. అందునను భూషణకవికి శబ్దాలంకారములపైఁ గొంత చాపల్యమగుటచే తానములతో తందనాలు ద్రొక్కించినాఁడు వృత్తములలో. కాని యెన్నియున్నను జీవితమగు నౌచిత్యమేదీ! గిరిక కేమి యంత పెద్దముప్పు? ప్రాణముదీసికొనునంతటి దుఃఖమేమి? వసురాజుపరిణయమున కడ్డుచెప్పినదెవరు? వసురాజుచేఁ దిరస్కృతయా? తన చెలియును, చమత్కారిణియును నగు మంజువాణికేల యామె యెఱిఁగింపలేదు? ప్రౌఢనాయికగాదా గిరిక? ఈచిన్నియుపాయ మామెకుఁ దట్టలేదా? పోనీ; యేడ్చి తానేమి సాధించినట్లు? వరూథిని జేల! ఆమె విలపించుటలో నర్థమున్నది. గిరిక యట్టిదిగాదుగదా? ఆహా! కవిబ్రహ్మ సైరంధ్రీపాత్రపోషణములోని యొకముక్కతో నివన్నియు సరిపోలఁజాలవుగదా! పురాణకాలమున దాల్చిన దుస్తులతోనే యెంతశోభనించినది తిక్కనవాణి! అల్లసానివాని వరూథిని "అల్లనల్ల" నేడ్వఁగా మాయింటియావిడ యేడ్పులో పాండిత్యము గ్రమ్మరించిన దని మూర్తి మురియవచ్చునుగాని యాజీవి యొక్కసారియైనను తీవ్రముగ జన మనఃపుస్తకముల విప్పి చదువలేదని చాటిచెప్పునని యాహింపలేదు గావచ్చును. మంజువాణిని తానే పంపియున్న గిరిక బుద్ధిమంతురాలే యగును

అది స్త్రీసహజము గాదందురేమో? అనుభవైకవేద్యములగు రహస్యములలో నిది యొకటి. ఔచిత్యానౌచిత్యములు స్థలమును, వ్యక్తినిబట్టి మారుచుండును. సాధారణముగా విలాసమన్నమాత్రముననే యొకవిముఖత అసహ్యము మన కలవాటైనది. అది మనమే యడిగితెచ్చిన వరము. మన మనోరథము లల్పములు. మన ప్రవృత్తి నివృత్తు లల్పము లగుటయే యందులకుఁ గారణము. అది మానవస్వభావ మనియు, దేహధర్మ మనియు, దాంపత్యమును తజ్జనితసౌఖ్య ములును కళంకములుకావనియు వ్యాఖ్యానము గావించునాఁడు దానికై యంతగా భయపడనవసరము లేదు. అయిన నందఱు వరుసగా స్వైరిణులు గావలసినదేనా యందురేమో! అది గాదు నాయభిప్రాయము. అందులకే తొలుతనే కాల దేశపాత్రములఁబట్టి యౌచిత్యము మారుచుండు నంటిని.

అందుకే మహాకవి విక్రమోర్వశీయమున మేనక చేతనే వలపు నెఱిఁగింపఁజేసెను. అతనికిఁ దెలియదా? కాళిదాసు మనోగతాభిప్రాయ మిదియకాఁబోలు! అచ్చరలు సురతమును కళగా సాధించినవారు. పేరెన్నికగన్న జాణలు. మేనక కంటికింపగువానిఁ గామించి తనవైదగ్ధ్యము ప్రకటింపఁ దలఁచినది. ఒకవేళ మేనక మిన్నకున్నను దానిచే నాప్రౌఢకు, గలుగు గౌరవమును లేదు. దీనిచేఁ దీసినదియు లేదు. ఆయాదశయందు జాతియందు తత్తద్వికారములు చెప్పకయే

వచ్చుచుండును.

భారతమున శకుంతలయే మొదట మనోరథ మెఱిఁగించునట్లు చెప్పియున్నను, కాళిదాసరూపకమున నావిధానమును మార్చివైచెను. ఎందులకు? శకుంతల అచ్చరగాదు కావున.

తొలుతనుండియు విదగ్ధగను, ధీరగను గనుపట్టుచు వచ్చిన గిరిక యిటమాత్రము ప్రపంచమే యెఱుఁగని బేలగా మారినదన్న నమ్మువారెవరు? రామరాజభూషణుఁ డాలంకారిక నియమముల ననుసరించి యీరీతి పూర్వాపరవిరుద్ధములఁ బొసగించెను. అంతియకాని పాత్రల నైజస్వరూపమున దృష్టి విడలేదు. కవిబ్రహ్మ యౌచిత్యమును తనివిదీరఁ గ్రోలిన మన కీ భోజనము వెక్కసముగాక మరేమగును?

ఆ సందులోనే సాహిత్యపోషణుఁడు వర్ణనలు ప్రారంభించినాఁడు. ఉద్యానవర్ణన, జలకేళి, మదనపూజ, అష్టాదశవర్ణనలు తలదూర్చినవి. గ్రంథము పెరిగినది. అలంకారనిపుణతయు పాండిత్యమును వెల్లడియైనవిగాని గిరిక నానావికారములతో కుబ్జాస్వరూపముగా మారినది.

అసలీగ్రంథమున వస్తువే చాల తక్కువ. ఉన్న వస్తువునందును సమగ్రత లేదు. గిరిక ముగ్ధగాదు; ప్రౌఢయు గాదు. ఏకవిధములగు భావముల రీతులామెయందు గానరావు.

అనుగుణమగు భావశబలత లేదు. ఒకసారి యేడ్పు, ఒకసారి నవ్వు. కడకు దేనియందు నామె "సమగ్రత" యను ధర్మమును సాధింపలేకపోయినది. అద్వితీయయగు వరూధినితో పోటీపెట్టుకొన్నది గిరిక. నిజముగా నామెకన్న ముందంజయే వేసినది. వేసినపాత్రమును సరిగా నటించలేని నటి. అదృష్టవిహీన. శాస్త్రములు చదివినది. సంస్కారసంపాద్యమగు కళను సంపాదించలేకపోయినది. శ్లేషబంధములు మొదలగు బంధములలోఁబడి క్షణికములగు చమత్కారములఁ జూప నేర్చినదే కాని నిత్యమై నిర్మలమగు సత్యమును జూపలేక పోయినది. ఏదో భావనానిర్మితయగు స్త్రీయైనది. ఆమె నిరంతరము మన యందు బాటులో నున్నది గాదు. అందులకే తెలుఁగుసీమలలో గిరికకు విహరించుట కుద్యానములు తక్కువ.

నిజముగా మూర్తి యుత్తముఁడు. గొప్ప పండితుఁడు. శాస్త్రములను వల్లించి వ్యుత్పత్తిచే సాధింపఁదగు కళాభాగముల నూరినాఁడు. సంగీతమున కొంత కొంత చిన్నెలు నడపినాఁడానందోపాసనకు. కాని తెగబారుకొన్న శాస్త్రాభిమానము వెనుక కీడ్చినది. నిజముగా భట్టుమూర్తియే యాంధ్రకవితాపితామహునిలోనున్న యాంతరికశక్తిని గురుతించి యందులకై ప్రయత్నించియున్న, గురువగు తాతగారిని యెన్నఁడో మించెడు వాఁడు. కాని యాతని కట్టిభాగ్యము పట్టలేదు. పైపై పూఁతలలోనే కాలము గడపి జీవితమంతయు నాతఁడు వ్యర్థ

మొనరించుకొన్నాఁడు. అందుచే రామరాజభూషణుని గిరికా దేవికి లోకమందలము బట్టకుండుటలో నాశ్చర్యము లేదు. అతని నామమును పండితులలో లెక్కింతుము. శాస్త్రకర్తలలోఁ బఠింతుము. కాని కవులలో నాతనికి చాల తక్కువ చోటు గలదు. అతని గిరిక పండితురాలు; విదగ్ధ. కాని మనసు దోఁచ లేని మగువ. వానకారులోని మెఱపువలె నొకసారి మెఱసి పోవచ్చునుగాని హృదయములందు చిరస్థాయిగ నిలువఁజాలదు.



# ప్రబంధనాయికలు

## సత్యాదేవి

పురాణకృష్ణుం డెటులున్నను ప్రబంధకృష్ణుడు :
"యువతీపాంచాలుఁడే." నరకాసురునిపై దండెత్తినాఁడుగదా ! గెలిచినవాఁడు—పదునారువేలభార్యలను గప్పముగాఁ దీసి కొన్నాఁడఁట. రసికతముందు ధర్మసమస్యగూడ ఆతనికిఁ గాఁబట్ట లేదు. వారుమాత్రము ఏరి పాఱవేసిన గవ్వలు గాదు, నరకాసురచక్రవర్తిగారు తెప్పించిన యచ్చరలు; నెలజవ్వనము పోలివోని నిగనిగలాడు సొగసుగత్తెలు. నరకాసురునివంటి రాక్షసునిబారినుండి తప్పివచ్చిన వెనుకవారును సంతోషముతో స్వామికొలువున కొప్పుకొన్నారు. వీరుగాక ప్రత్యేక మెనిమిదిమంది పట్టపురాణులు. "పులు గడిగిన ముత్తెములు." అంత వారి కభిమానము మాత్రము దక్కవుండునా? అంద రందరే! "సమతాభిమానవతులఁట!" మహత్త్వమున్నది. సంపద—వైభవము...అతని కేమి లేదు. ఏయే ఋల్లా లేయే

రీతిగఁ గామింప నిశ్చయించిన నాయావేషముతో స్వామి ప్రత్యక్షమై (౧-౪౦) భోగించి, సుఖములఁ దేల్చువాఁడు. అతని పెద్దభార్య రుక్మిణి. చిన్నయిల్లాలు సత్యాదేవి. వీరిరువురికిఁ బోటికి పోటి. వీరిద్దరినడుమ నలిగిపోయినాఁ "డాచతురాంతః పురవధూప్రసాదనరసికుఁడు" 'పోనీ లెమ్మని' యూరకుండదు ఛాందసురాలు రుక్మిణి. తనచేయి క్రిందగుటోర్వదు సత్య. కృష్ణమూర్తిగారు తాళము వేయు టెవరితట్టు? అతఁడు గూటి లోని పిల్లి. పెద్దభార్యయెదుట వైతాళికుఁడు. చిన్నభార్యకు సేవకుఁడు. ఎట్లో యొకరీతి నీడ్చుచున్నాఁడు తన యవతార మును. మొత్తముపై నందరికిని కలిక మద్దినాఁడు. ప్రపంచ మన్నదిగదా "పాపము! కృష్ణుని కిరువురును రెండుకన్నులు. ఎవరితట్టును బలుకఁడు. ఇరువురిని సమముగ మన్నించు మనస్వి" యని. ఇఁక రుక్మిణియా! అల్పసంతుష్ట. ఆమెయు "నా కేమి! మగనికూరిమి బండ్లకెత్తింతు"నని మురిసిపోయినది. సత్యాదేవి "సర్వవిధముల నాదాసుఁడే యాపసులకాపరి" యని సాభి మానముగఁ జాటుకొన్నది. మంచియుక్తిమంతుఁడే కృష్ణుఁడు- కాని కడ కాయనయుపాయమే గళబద్ధమైనది; భార్యలు రచ్చ కెక్కకున్న బ్రతికియుండెడివాఁడే! ఆడువారి నోరు, తప్పె టయు నొకటి. సవసవగా బయలుదేరినవి హేళనములు, ఆత్మ స్తుతులు; వెక్కిరింపులు. మండిమండి కడకు రవరవలకు దిగినవి.

పనిలేని దాసీలు మెల్లగవచ్చి పొంచులువినుట కారంభించినారు. సత్యాదేవిగారు కోపగృహములోఁ గస వూడిపించినారు. కృష్ణ మూర్తికిఁ బ్రారంభమైన నగచాట్లు. ఇది యింత లక్షణముగా నుండఁగా, స్వామివారికే సొంతముగ నొక చాపల్యము కద్దు. వారికి సత్యాదేవియందుఁ గొంచె మభిమానము. రుక్మిణీదేవి కొంచెము వయసుదిరిగిన యిల్లాలు. అందులోఁ బురాణకాలము నాటిది. భక్తి, భాగవతసేవ, తులసిపాటలు, కథలు, కారణాలు ఆమెకుఁ గావలసినవి. సత్యగారు నైసర్గికముగా నందరిలోనను రూపవతి. ఆహార్యకముపైఁ జాలదృష్టి. విలాసవతులలోఁ బేరు వ్రాసినది. రంగురంగుల దుస్తులు, సీతాకోక చిలుకవంటి యొయ్యారము కృష్ణమూర్తిని బూర్తిగా లోఁగొన్నవి. ఆమె కటాక్షము పదివే లాయనకు. ఆమె చీదరించుకొన్నను వెడలి పోక "వాకిటి కావలి తిమ్మని" వలెఁ బంస గాచియుండువాఁ డా పురాణపురుషుఁడు. సత్య మగనికిఁ గొన్ని నిబంధనము లేర్పాటు చేసినది. కలలోఁగాని నవ్వులకుఁగాని తనమాట జవదాఁటరాదు. ఏపదార్థముఁ దెచ్చినను దొలుతఁ దానింటిదేవుఁడు. తన కారగిం పైనఁ దరువాత నందరికి దయాభిక్ష. చెలులు దనతో నేమియు చాడీలు చెప్పరాదు. చెప్పినచో వారిమాటలు నమ్మి ప్రతివాది తరఫు వకీలు లేకనే తీర్పుఁజెప్ప నధికార మామె కున్నది. అందుల కతఁడు బద్ధుఁడు గావలసినదే. తనచెవి కెక్కకుండ

నతఁడు వారికి "లంచాలో గించాలో" యిచ్చుకొనవచ్చును (౧—౫౮). తోడిచేడియలు దనపై వంతుకు వచ్చిన సైరింప రాదు. కృష్ణమూర్తియు నీనియమములను "తూ-చా" తప్పక యనుసరించుచున్నాఁడు. అతని యనుసరణము "ప్రాగ్రసివ్"గా నున్నదని తోఁచినయెడల నప్పుడప్పుడు "కృతకాద్రికందరా కేళీనిగూహనవేళా పరస్పరాన్వేషణములు, పోషితమాధవీ పున్నాగపరిణయోత్సవ కల్పితానేకసంభ్రమములు, చాతురీ నిర్జితద్యూతపణాదానకలిత చేలాంచలాకర్షణములు, సాయం సమారంభ చక్రవాకద్వంద్వ విరహావలోకనవిభ్రమములు" మొదలగు "రెడ్డుమార్కు" లిచ్చుచుండినది; లేనినాఁడు "బ్లాకుమార్కు", "ఫైను", "సస్పెన్షను" దప్పదు. కృష్ణమూర్తియు నడుముపట్టుఁబట్టినాడు. కొన్ని దినములు గడచినవి.

ఒకనాఁడు నారదుఁ డావాహనమైనాఁడు రుక్మిణియింటికి. ఈ భాగవతుల కందరికిని ధర్మసత్ర మదియేగదా! ఆవేళకు సరిగ గృష్ణమూర్తియు రుక్మిణీదేవిగారి "జనానా" లోనే యున్నాఁడు. ఏకాంతమునఁ గొంతమంది ధవళాంబుజనేత్రులతో జూదమాడుచున్నాఁడఁట. నారదుఁ డక్కడివారందరికిని బరిచితుఁడే. మునులు సన్యాసులలో నెవరో యొకరే— రుక్మిణీదేవిగారి ద్వారపాలకులకుఁ దెలియనిది. మహతి, కమండలువు, చెవులలో రుద్రాక్షపోగులు, చేతులలోఁ దులసి

పూసలు "పిక్చ్రెస్కు"గా నున్నాఁడు. వెంటనే యమ్మగారికిఁ దెలియవచ్చినది నారదాగమనము. జూదము విడిచి యర్ఘ్యమ్ము, పాద్యముఁ దీసికొని తయారైనది. విధిలేక కృష్ణుఁడు వెంటఁబడినాఁడు. భార్యాభర్త లిరువురును బ్రహ్మ మానసపుత్త్రు నెదురుకొన్నారు. సగౌరవముగఁ దెచ్చి యర్ఘ్యపాద్యములిచ్చి యాసనముపై నుపవిష్టుఁ గావించినారు. ఆ రణభోజనుఁడు మాత్రముసామాన్యుఁడా! కృష్ణుని బోనులో నిరికించి నప్పటికే దయచేసినాఁ డాతఁడు. కృష్ణునిపై నమస్కార బాణముతోఁబాటుఁ బ్రార్థనాపద్యములు విసరినాఁడు. మనుష్యులకే యనుకొన్న, భగవంతునికిఁగూడ నున్నదాత్మ స్తుతుల కలరు రోగము. కృష్ణుఁ డానందముతో గడియసేపు కన్నులు మూసి విష్ణుమూర్తినై తనవైకుంఠమును, అవతార ములను, జయవిజయులను దలఁచుకొన్నాఁడు. ఆసందడిలోఁ గమండలువులోనుండి "పారిజాతంపుఁ బ్రొన్నన" దీసి— మిన్నేటి పసిండినెత్తమ్మి చిగురుటాకునఁ బొదివి "పత్రం పుష్పం ఫలం తోయ"మని ప్రాణముల కురిఁదెచ్చి పెట్టినాఁడు. కృష్ణుఁడూ పరిగ్రహింపవలెనా? లేదా?

కృష్ణుని మనసులో ననేకభావములు మారినవి. బయటికిమాత్ర మొకటియుఁ గానఁబడలేదు. "వినయంబు విస్మయము" మాత్రము నిలిచినవి. చేతులుచాచి మహా ప్రసాదమని స్వీకరించినాఁడు. ఔను, దాని నెవ్వరి కీయవలెను?

తనబలగ మెంతయున్నది! ఆకొంటెనారదుఁ డొకటేగిల్లుకొని వచ్చినాఁడు. పదునారువేలభార్యల విషయము చింతలేదు, వా రాదర్జా యాసింపరు. తక్కిన పట్టపురాణులకు సమాధాన మెట్లైనను జెప్పుకొనఁగలఁడు. మిగిలినవా రిరువురు. వీరే ప్రాణగండము. సత్యకిచ్చిన రుక్మిణిమాటి మూరెడు పొడవగును. రుక్మిణి కిచ్చిన సత్య నిప్పులు గ్రక్కును. రుక్మిణి యెదుట నున్నది. సత్యలేదు. అయిననేమి? ఆమె పరిచారిక లంతల నింతల నుండరా? పోయి చెప్పినచో గ్రహచారము నప్పినటులే. చూడుఁ డెటు లాలోచించుచున్నాఁడో యా తేలుగుట్టిన దొంగ—

"ఇది భోజాత్మ జ కిచ్చిన న్గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి దానికే నిపుడు ప్రేమ న్పంపినన్ దీని నె
ల్లిదమున్ జేసిన జాడ దోచునొకో..."

ఇంతజాగ్రతగా నాలోచించియు మఱలనాతనికర్మమేమో మాయలోఁబడినాఁడు. రుక్మిణి యెదురుగానున్న దేయని యొక ధర్మసందేహముగలిగి తటాలున నామెచేత వైచినాడు. నారదునికి రొట్టువిరిగి నేతిలోఁ బడినట్లైంది. "ఊ-ఊ-కాని మ్మని" (౧-౫౫) కనుసైగఁ జేసినాఁడు. నిజముగా రుక్మిణి యల్పసంతుష్ట. విరి నివ్వకున్నను నేమి యని యుండ దమాయికురాలు!

నారదుఁడు వచ్చినదే కలహముఁబెట్టుటకు. ఇంతకు

మునుపే 'ప్లాను' వేసికొన్నాఁడు. తనకార్యసాధన కవకాశము నక్కై గాచుకొన్నాఁడు. తనభాగ్యము పండినది. ఇన్నిదినముల యేకాదశి యీపారణతో ముగిసెనని మురిసినాఁడు. తిన్నగా మహతి నావలఁబెట్టి ప్రారంభించినాఁ డుపన్యాసమును. మొదటనే ప్రార్థనాపద్యములతో వినాయకప్రార్థనముఁ గావించినాడు. "అమ్మా ! నీనుంచర వెలఁదులు పదియారు వేలును దిగఁదుడువనా? కృష్ణుఁడు వారిని జేసికొన్నాఁడుగాక! నీకు సరిపోవువా రొక్కరైన నున్నారా" యనునది మొదటి యస్త్రము. హరికి నీవు బహిఃప్రాణ మనునది ముఖస్తుతికిఁ బరాకాష్ఠ. ఈరీతిగ ముఖస్తుతితో నామెనోరు గట్టివేసి తిన్నగఁ దాను దెచ్చిన సరకును గురించి పొగడ మొదలిడినాఁడు. అది పరిమళము సెడదట. ఎన్నడును ఎంత క్రిందు మీఁదైనను వాడదఁట. శుభావహము. ఇంతయేల? జగదేక మనోహరము' అని చెప్పిన వి చెప్పనివి యన్నియు నీయూకుతో విసరినాఁడు. ఈసందర్భములో నొడలు మఱచిన నారదుఁడు యోగిభాగవతాగ్రేసరుఁడు నిక్కచ్చిగాతా బ్రహ్మచారి యాడినమాటలఁ జూడుఁడు:

"అళినీలాలక ! నీవు నీపతి రహ
స్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధ సంగరంబునకు ను
ల్లాసంబు గల్పించు నీ

జ్జ్వలదీపాంకురమై రతి
శ్రమ తనూసంజాత ఘారాళఘ
క్షలవంబు ల్దొలఁగింపఁగా సురటియై
రంజిల్లు నిచ్ఛాగతిన్.

మహామనీషియు, మహానుభావుఁడును నగు నారదుఁ డీ వాక్యము లెట్లు వివరించెనో, నీతిజ్ఞుఁడును నుదాత్తుఁడును నగు కృష్ణమూర్తి యీవాక్యము లెట్లూకొట్టెనో, రుక్మిణీదేవిగా రెట్లు వినిరో పాఠకులే యూహింపుఁడు. బహుశః నారదునికి చాపల్యము లేకున్నను నోటిచాపల్యముమాత్ర ముండెనేమో! అనఁగా, ముక్కుతిమ్మనకు పీడ లేదన్నమాట. కవి యంతటి శృంగారప్రియుఁడు గనుకనే మహర్షియగు నారదునిచే నీ పచ్చిమాట లనిపించినాఁడు. ఆ రసికత యౌచిత్యముఁగూడ గ్రహింపనీయదు. ఔచిత్యములేని రసికత యెంతవఱకు కుపయోగించును?

ముక్కుతిమ్మన మహాజాగ్రత్తగలవాఁడు. అతఁడు వాడుపదములు ధ్వనిగర్భితములై పాయంసమయము నందలి గగనమండలమువలె గంభీరములై యుండును. ఉత్తమకవుల భావములను మనస్తత్త్వములను దినములకొలది యోచించి యరిగించుకొన్నమనీషి. ఒక్కొకయెడ "వారిభావములేనా" యనిపించునంతవరకు నుత్తమకవుల పోకడల ననుసరించినాఁడు. తాను జదివినశాస్త్రమంతయు వ్రాయుపుస్తకమున గుప్పించక

పోయినను వాడుపదములు, పలుకు భావములు ముక్కు-
తిమ్మన కనుభవమును, అపారమగు శాస్త్రపరిచితియు, అరుదనదగు సాహితీవివేకమును గలదని చెప్పకయే చెప్పుచున్నవి. ఆతనిశైలి యొక్కొకయెడ నెంత గంభీరముగఁ బరుగిడుచున్నదో చూడుఁడు:

సీ. జీర్ణ పర్ణ ప్రసంకీర్ణాహిమాణి విభా
 మామా కిసల వంచ్యమాన పికము
శశికాంత రుచి మృషాసలిల సంస్ఫాలన
 శ్లక్ష్ణవిషాణోద్విగ్న సైరిభంబు
గోమేధిక ప్రభాంకూర మధ్యా మధు
 ద్రవలిలిక్షామిళ ద్భల్లుకంబు
నీలగండప్రస్త రాశీక గజ ఖేద
 శీర్య న్న ఖిత్తుబ్ధ సింహాకులము
గీ. గారుడాశ్మచ్ఛ విచ్ఛటాంకపటు యవస
 పూలికాచర్వణ వ్యగ్ర బాలమృగని
 లంఘ్య మానాబ్జరాగ శిలావితాన
 కూట దావాగ్ని యామరుత్కంధర మబల.

కృష్ణుఁడు సత్యాదేవితో స్వర్గమునకుఁ బోవుచు మార్గమధ్యమున మేరువును వర్ణించున దీఘట్టము. వస్తువునకు శైలికి నపరూపమగు పొత్తు గుదిరినది. మేరుశిఖరమువలె విశాలదీర్ఘములగు సమాసములు ఛాయామాత్రముగా మేరువును జూపఁగలుగుచున్నవి. కడపటి శిఖరమువలె

యెత్తుగీతి మనోహరమై గంభీరమైయున్నది. ఇంతియ గాదు. సామాన్యపదములు వాడుటయందును నాతనిదృష్టి పొరపా టెఱుఁగనిది.

> పూనుకొని మేలు-గీళ్లకు
> లోనయి విహరించువారి లోక మెఱుఁగదో
> యా నరకాసురదమనుఁడు
> దా నెఱుఁగఁడో! భోజకన్య తా నెఱుఁగదో కో!
> అతులమహానుభావమని యవ్విరిఁ దానొక పెద్దసేసి య
> చ్యుతునకు నిచ్చికంబొదవ నూడిద యిచ్చిన నిచ్చెగాక తా
> నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణసేసినఁ జేసెఁగాక ..
> వంతున కెక్కు సత్యగరువం బిఁకఁ జెల్లదటంచు మానినీ !

మఱి యింతటి యుదాత్తుఁడు జాగ్రత్త గలవాఁడు నగు ముక్కుతిమ్మన యీసందర్భమున నారదునిచే రతివిషయక మగు ప్రసంగము నెట్లు సేయించెనో విచారముగ నున్నది. బహుశః కృష్ణశర్మ గారన్నట్లది యాకాలమునాఁటి యభిరుచియై యుండును. ఆశృంగారావేశమున పాఠకులకుఁగాని శ్రోతలకుఁగాని వారి నడుమనున్న కవికిఁగాని యీవిషయము దట్టియుండదేమో! పద్యము ముక్కుతిమ్మన వ్రాయఁదగ్గదే! సర్వవిధముల మధురముగ నున్నది. ధారాశుద్ధి పరిస్ఫుట ముగఁ గానిపించుచున్నది. లతాంతాయుధసంగరమున లతాంగికి లతాంగమే సహాయకారి యగుట యొప్పినదిగదా! దీపాంకురము—ఇది గృహసులు గమనింపఁదగినది. దీపాంకు

రమే రత్యుద్బోధకము.—అది యంత విప్పి చెప్పఁదగినది గాదు—యూహింపఁదగ్గది. "ఇచ్ఛాగతిక" దీనియందును గభీరమగు ధ్వని యున్నది. నారదుఁ డింకను "రహస్యక్రీడ" యని కొంచెపు పరిమళమునే చూపినాఁడు పలుకుఁదనముతో: ఎన్ని యున్న నేమి—అస్థానపతితము. ఇయ్యెడఁగాక వేఱుచోట నున్నచోఁ బాఠకుని మనసును సంపూర్తిగ లోఁగొనియే యుండును. ఇట మన మెంత యానందించినను సందర్భరాహిత్య మనునది ములుగర్రవలె బొడుచుచునేయుండును. ఇచటి నార దుఁడు సమాధిలోని యోగి గాఁడు. వారి కేమి ? చాపల్య ములు సుఖదుఃఖములు వికారములు నున్నవా యని సరిపెట్టు టకు. సంవత్సరమెఱిఁగిన "చలాకిమనిషి."

ఇంతకుఁ గవి యెంతగఁ బ్రయత్నించినను దన మనస్త త్త్వము నెచటనో యొకచోట వెల్లడించక మానఁడు. మాను టయు సాధ్యము గాదనుట కిట్టి యొక సాక్ష్యముగ నుండఁ గలదు. ఇంత బ్రహ్మాండముగఁ బూవును వర్ణించుటయు, రుక్మిణిని గృష్ణుని గొండలపైకి నెత్తుటయు నెందుకా యని యాలోచించి తిమా ! ఇక్కడున్నది హృదయము — అతఁ డన్నమాటఁ జూడుఁడు.

చక్కనిదాన నంచు, నెల
జవ్వని నంచు, జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతి

రొంతయుం నా కనురక్తుఁడంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీగుచు
గణింపదు కాంతల సత్య యింతయుఁ
బ్రక్కకయున్న నీమహిమ
జూచిన బోటులు విన్నవించినన్. (౧ ౬౬)

ఇది యాతని ప్రస్తావనకు ముఖ్యబీజము. ఇంతవఱకు హృదయమున దాచియుంచుకొన్నవాఁ డవకాశము దొరికిన వెంటనే "యిదే పదివే"లని వెళ్లఁగ్రక్కినాఁడు. బహుశః వారదుఁడు సత్యాదేవి పంపియున్న దాసిని జూచియుండునేమో; అందులకే యింతగా నొత్తి చెప్పియుండును.

అతఁ డనుకొన్నంతవఱకు జరిగినది. చూచి దాసీలు వేఱువేఱ దేవేరులకు విన్నవించినారు. స్త్రీహృదయము గదా! అందున సవతిమచ్చరము అడువారి స్వభావము. వారందరు వరుసగఁ జిన్నవోయి వన్నెఁ దఱిగినారఁట; అవును - ఇంతకుఁ జేయున దేమి గలదు? రుక్మిణి పట్టమహిషి. ఆమె చెలాయించిన యాజ్ఞ యందరికి; మఱి యాగౌరవ మామె యితరులకుఁ దక్క నిచ్చునా? ఒకవేళ రుక్మిణిని గాదన్నను కృష్ణుఁ డామెకు వశుఁడు. ఏమిచేయవచ్చును! అనలేక—అనుభవించలేక— క్రుక్కి క్రుక్కి—కడకు వారే కన్నీరు దుడుచుకొన్నారఁట. కాని యనితరశేముషీవతియు, అనన్యసాధారణ సౌందర్య విభాజిత మనోహరయు, మానవతులలో నగ్రతాంబూలముఁ

గొన్నదియు, మహనీయ సౌభాగ్యవతియు నైన సత్యాదేవి సైరించునదేనా? ఆమెకుఁ దెలిసినచో మఱల గోపికావల్లభుని బ్రతుకు బందల పాలుగాదా! ఇఁక రుక్మిణిగతి?

సత్యాదేవి యుద్యానవనమున హాయిగఁ జల్లగాలిని సేవించుచున్నది. చంద్రోపలవేదిక - కృతకాద్రి - అంకెలు వేసి డొంకలేర్చి దిద్ది తీర్చిన పూఁదేనియ యేటికాలువలు, చెంగలువపుపాళ్లు! ఇంక చెప్పవలెనా! మన కవులకు సర్వము రమణీయతముగా నున్నది. అంతకుమునుపే యామెకు మన కవుల సంప్రదాయము ననుసరించి "దక్షిణాంస చూచు కనయన ప్రకంపములు" జరిగినవఁట. అందు కామె యాశంకించిన ఫల మేమనుకున్నారు? "ప్రాణనాథుఁ డొంటొక దానితోఁగూడి - నన్నేమైనఁ గ్రిందుఁబరచినాఁడా? నా ప్రసంగ మేమైన నెత్తినాఁడా?" యనియే. నిరంతర మాతనిమీఁద నే యామెకన్ను, చేతిలోఁ గొరడా విడువదు. మిసికిన యూక దెబ్బలు తప్పవు పాప మాపురాణపురుషునకు. ఇంతలో దాసి వచ్చినది. సొక్కుచు సోలుచు అఱచుచు నార్భాటముతో. ఏమి యా రగడ యనఁగఁ గృష్ణమూర్తిపైన క్రిమినల్ కేసు. మానసష్టము దావా తెచ్చినది. మరునిముసముననే తీర్పు జారీచేయడము - అన్నియును. దాసిమాత్ర మేమి సామాన్యముగఁ జెప్పలేదు సుఁడీ. తక్కువలు దీర్చినది. వంకలు దిద్దినది. కథను బాగుగా బాకమునకు దించినది. "స్వామి

వారి కవిత్వము - తనకపిత్థము"ను జేర్చి సత్యాదేవిగారికిఁ గావలసినంత నూరిపోసినది. తప్పు దొరికినఁ జాలుననుఆశ యందరికిఁ గద్దు. దానికి రెండు లంచములు. సత్యగారును మగనికిఁ బరీక్షఁబెట్టి "తన దర్జా" లోని "లగువు బిగువు" గనుఁగొనవచ్చు ననునాశతో చిన్న "యెక్స్పెరుమెంటును" ప్రారంభించినారు. లేకున్న కృష్ణమూర్తిదేనా మహాపరాధము? అసలు నారదుఁడు అమ్మగారికి తిట్లు వడ్డించినవాఁడు. రుక్మిణీ దేవి సంతోషముతో విన్నది. కృష్ణుఁడు అర్ధప్రాణముతోఁ జెవులు మూసికొని నిలఁబడినవాఁడు. మరెవరికో యిందులో శిక్ష న్యాయముగఁ జెప్పుడు? ఇంత విచార మామె సేయలేదు. నారదునికిఁ గలహప్రియత్వము స్వభావము. అది లేని పతనికిఁ బూట గడువదు. కనుక తన "కడుపాత్రము"నకై రెండు ముక్కలాతఁ డల్లును. ఇఁక విన్న రుక్మిణియా! ఆమె నెందుకన వలెను? రుక్మిణిని నెత్తిపై నెక్కించుకొన్నవాఁడును గృష్ణుఁడే, రుక్మిణి సత్యదృష్టి కొక ప్రాణిమాత్రము గూడ కాదు. కాని యామెకుఁ దోఁచిన పెద్దయపరాధ మేమన—నారదుఁడు దన్ను నిందించునపుడు "పోనీలేవయ్యా" యనలేదఁట గృష్ణుఁడు. ఇది మ్రింగరాని యపరాధమై యామెను బాధించినది. పాపము! దీనిపై నిదియంతయు "ధూర్తగోపాలుని చెయిదమే" యని కథ నంతయు నందులో ననుసంధించుకొన్నది. వ్రేటువడిన యురగాంగనవలె భీషణహుతాశనకీలవలె "హాయని" లేచిందఁట.

నాకుఁజూడ సత్యాదేవి భార్యగను, కృష్ణమూ_ర్తి పెనిమిటిగను గానరారు. సత్యయందు సంపూర్ణమగు ప్రేమ యున్నది. అది నిజము కాని యయ్యది యు_త్తమమగు పద్ధతులలో నడువలేదని మాత్రమే చెప్పవచ్చినది. కృష్ణుఁడు దనకుఁ బూ_ర్తిగా లోఁబడిన శృంగారప్రియుఁడే యనుకొందము. ఆచాపల్యముచేఁ దనకుఁ గొంతయధికారము నెక్కువగ నిచ్చి యుండవచ్చును. నిజముగఁ దాను గౌరవింపఁదగిన భ_ర్తగదా! అట్టియెడఁ బ్రణయస్వరూపిణియగు సత్య తన యధికారము నింత వెక్కసముగఁ జెలాయించవచ్చునా? మగనిని బూరికన్న హీనముగఁ జూచుచున్నదే! ఆమె యమాయికురాలే కావచ్చును. కాని వాయాడితనము మాత్రము పనికిరాదు గదా! ఇంతేగాదు. ఈభార్యాభ_ర్తలు పారిజాతమునకై స్వర్గలోకమునకు వెల్లినారు. పారిజాత తరువును దీసికొనివచ్చుచుండఁ ద్రోవలో ద్వారపాలకు లెదిరించినారు. కృష్ణమూ_ర్తి మగవాఁడు గదాయని యేమో పెద్దరికముతో నుత్తర మివ్వఁబోయినాఁడు. సత్యభామ యూరకుండునా! "చాలులే! వారికిఁ దగిన సమాధానము నీ వేమిత్తువు? నేను లేనా హేతువాదములోఁ జేసు వ్రాసిన దానను, ఊరకుండుమని" వెనుక కీడ్చినది. అక్కడనుండి చను త్రోవలు వెడదోపి నిక్కగఁ గొంతు సవరించుచు నడుము

మూతి ముక్కు కన్నులు త్రిప్పుచు చేతులు బారలు చాచుచు నుత్తర మిచ్చినదఁట. ఆయుత్తర మెటులున్నదో చూడుఁడు.

సీ. విభుఁడు సురేశ్వరు వరపాలకులు వార్థిఁ
బొడమిన యీదివ్య భూరుహమున
కింద్రాణి యెవ్వతె, యింద్రుండు నెవ్వఁడు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనఁగాక
తెకతేర యిదియేమి యొకరిసొమ్మె?
యిదె నాదు విభునిచే నీవదాన్యనగంబు
నొడిపించుకొని యేగుచున్నదానఁ
బలుకు లేటికిఁ దా వీరపత్నియేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవు నిటుఁబంపి సత్యభామావిధేయుం
వలన మరలంగఁగొనుటె పో వాసితనము.

అని శచీదేవిని సవాలుకుఁబిలిచినది. కృష్ణమూర్తి మఱలఁ బారిజాతము నివ్వఁదలచినను సత్యాదేవి యీయనిచ్చునా! ఇఁక నతఁడో! "అన్యథా శరణం నాస్తి"యని యామెపాదములే యాశ్రయించి యుండువాఁడఁట. ఆమెయే "సత్యభామా విధేయుఁ" డని ఢంకావేసి చాటుకొన్నది. కృష్ణమూర్తి యెంత యింద్రియలంపటుఁడైనను మానావమానములును సుఖదుఃఖములును లేని మ్రానిబొమ్మగాదు గదా! ఒకసారి యైనను మనసు విరుగకుండునా! ముక్కుతిమ్మన్న మగవారిపై

దండెత్తివచ్చినాఁడేమో యనిపించుచున్నది. అస లింతకుఁ జిన్నాదేవి లంచపు మహిమ యట్టిది. నిజముగా అరణముగా నుండఁదగువాఁడే తిమ్మన.

కృష్ణునికి దాసి వచ్చి పోయిన సమాచారము దెలియ వచ్చినది. అప్పటినుండియు మనసులో "గిలి" ప్రారంభమైనది. నిలిచినచోట నిలువలేఁడు. తనపై నేమేమి కొండెములు గల్పించిచెప్పెనో, సత్యాదేవి యేమన్నదో, యెటులున్నదో-తా నింకఁ బోయిన మాటలాడించునో లేదో, "బస్కీ" ల యపరాధదండన మెంత విధించునో యని వ్రేగిపోయినాఁడు. అతనికి నారదుని సల్లాపములుగాని, రుక్మిణి మొరలుగాని గాఁబట్టలేదు. "రామ రామ! లేని తగలాటముఁ దెచ్చిపెట్టుకొంటినే" యని ప్రద్యుమ్నకుమారునితో ముని చెప్పు విషయముల కూఁఅ కూకొట్టి కార్యము జరుపురా యని పరారయినాఁడు. అమ్మగా రావణకే కోపగృహములోఁ దయారైనది. ఇంతకుమును పుండిన గద్దలములేదు. దాసీలందరును మూలలలో నక్కినారు. చిలుకలు గోరువంకలు మ్రాఁగన్ను వెట్టి నిద్రపోవుచున్నవి. వానిని మాటలాడించువారు లేరు. వీణియలు మూఁగలైనవి. మేడ యంతయు బాపము చిన్న వోయినదఁట. చూచినవెంటనే యర్థముఁ జేసికొన్నాఁడు కృష్ణుఁడు. ఈదినమేమో పండుగయున్నదని. ముందుకు సాగినాఁడు కోపగృహము "హాలు"లోనికి. సత్య బిఱ్ఱుగా

ముసుఁగుఁ బెట్టినది. మాసినచీర - నిడువాలిక కస్తురిబొట్టు-భూషణములు ధరింపలేదు-తెలుపుఁగట్టి పలపలనై-వణకుచు మూలుగుచున్నది. కృష్ణుఁడు పరిచారికచేతి వీవనను దీసికొని హాయిగా విసురుచు పారిజాతపూవాసనఁ జూపి రెచ్చఁగొట్టి నాడు. సత్య 'వచ్చినాఁ డపరాధి యని చూచి చూడ నట్లు సూచి మఱల ద్విగుణీకృతముగు పట్టుదలతో' ముసుఁగు బిగించిది. కృష్ణుఁ డట్లు బిగిసి యుండఁగలఁడా? ఆమాత్రపుఁ బట్టుదలయున్న నింత రామాయణమెందుకు ? సత్యాదేవి గారును "మంచమును బట్టి గాళ్ళు దాచెడిదే" అవకాశ మున్నదని గ్రహించియే హృష్మని నీల్గినది. అనునయించిన వాఁడు సామాన్యముగ నన్నాఁడా? "ఓసత్యా! నీదయ, నాయదృష్టము. నీ వొక నిమిసము మాటలాడకున్న నాకు స్వర్గప్రాప్తి దప్పదు. దయచేసి యొక గడగంటిచూపు విసరవే" యని బ్రతిమాలినాఁడు. కడకు "దాసుని తప్పులు దండముతో సరి" యని కాళ్లుచాచి సాష్టాంగనమస్కారముఁ జేసినాఁడు. అది యొక నాటకమఁట! తాను సూత్రధారియఁట! ఎంత నటనమైన నింత యవస్థ దగదు పాప మా మహాను భావునకు. ఇంత మనవిఁజేసినను దేవిగారి మనసు గరుగలేదు, కష్ణమూర్తిగారి తలకాయ ఫెళ్లీమన్నది.

జలజాతాసనవాసవాదిసుర పూ

జాభాజనంబై తన

ర్చు లతాంతాయుధుఁ గన్నతండ్రి శిరము
చోఁచె వామపాదంబునన్
దొలఁగన్ ద్రోసె లతాంగి! యట్లయగు కాం
తు ల్నేరము ల్సేయఁ దే
రలుక జ్జెందిన యట్టికాంత లుచిత
వ్యాపారము ల్నేర్తురే!

ఆమె యెంతగఁ దన్నినదో మన మెఱుఁగము. ఆ యావేశములో నామె సామాన్యముగఁ బోనిచ్చియుండునా! కవిగారుమాత్రము నాజూకుగఁ దొలఁగఁద్రోసిన దని బిగువైన సాక్ష్య మిచ్చినారు. పైన "నవుసు, కృష్ణునికిఁ గావలసినదే! లోకములో నెవరైన నే" మని సత్యచేతను సమర్థించినారు. ఇంతటి పక్షపాతమున్నది కవిగారికి. కాలిదెబ్బఁదినిన కృష్ణుఁ డందమా, యవే రెండుపాదములు గట్టిగఁ బట్టుకొని "అమ్మగారు! తమరు చాల నలసినారు, వీఁడు తమ దాసుఁడు గదా! తన్నినను పనవా లేదు" అని యేమేమో యన్నాఁడఁట. నిజముగఁ గృష్ణుఁడు సిగ్గులేనివాఁడు. అందుకే యామెయు నంతటి దర్పాటుఁ జూపించినది. దెబ్బఁదినినదే గాక పైననామె నోదార్చువేళకు బ్రహ్మప్రళయ మైనది కృష్ణమూర్తికి. "పసులకాపరీ! పల్లెపికిఁనరా! నాయట్టి భార్య నీయదృష్టమువలనఁ దక్కినది. నీయోగ్యతకు నేను వలచుదాననేనా! పో" మ్మనినది. ఇవన్నియు ప్రణయాశీర్వాదములే యని యా "జగన్నాటకసూత్రధారి" తృప్తిపడినాఁడఁట.

ముక్కుతిమ్మన మహాకవి యసాధారణమేధావి. కథను నడుపుటలో నాతఁడు చూపించిన సన్నివేశములు, కల్పించిన వర్ణనలు చదివి చదివి యానందించఁదగినవి. ఇతర ప్రబంధములకుఁ బట్టిన చీడపురుగు లెన్నియో దీనికిఁ దప్పినవి. చంద్రదూషణముఁ మలయమారుత మన్మథదూషణాదులు లేవు. అంగాంగవర్ణనలచే సిగ్గు విడిచి పాఠకుల నొప్పించలేదు. కవిత్వము మెఱపుఁదీఁగెవంటిది. యతిప్రాసములకుఁ బదముల వేయఁడు. నియమములకుఁగాను ఘుటశ్రాద్ధములఁ బెట్టఁడు. పలికిన పదము, చూపిన భావము ప్రతియొకటియు నత్యంత మనోహరము. ప్రకృతివర్ణనములలో నితఁడు సూపిననేర్పు వర్చస్సు మనకవులు తపస్సుఁజేసి సాధింపఁదగ్గవి. సర్వవిధముల నుత్తమకవులలో నొకఁ డితఁడు.

సత్యాపాత్రము మాత్రము కొంచెము ముదిరి నసరైనది. ఆకాలపు రసికత కది తార్కాణయైనను బాధలేదు. అటులైన నా యభిరుచి పొరపాటన్నను తప్పుగాదు. అందుముగూడ. నిజముగ సత్యవంటి యాఁడదే సంఘమున నున్న "గయ్యాళి గంప"యని చీదరించి యుందుము. కావ్యమున నున్నది గనుక మన కంతగఁ దోఁచుటలేదు. ఇఁకఁ గొంత స్వభావానుగుణముగఁ జిత్రించియున్న మఱింత బాగుగ రక్తికట్టి యుండెడిది. "భావాంబరవీథి విశ్రుతవిహారిణి" నిముసము సేపు దలఁచి కన్నులు మూయవచ్చును.

# ప్రబంధనాయికలు

## సూరన్న ప్రభావతి.

సూరన్న పెద్దన్నగారి మనుమరాలి మగఁడఁట. ఒక నాఁడు తాతగారు మనుమనిఁ జూచి "నాయనా! చల్లగ నొక పద్యమల్లరా; చూత"మని తమాష కడిగిరఁట. సూరన్నయు గొంతు సవరించుకొని తిన్నగఁ బ్రారంభించినాఁడు. "తలఁపక జొప్పడి యొప్పె నప్పుడు" అని కూనిరాగము మొదలిడిన తోడనే యనుభవశాలి యగు పితామహుఁడు "చాలుచాలు లే! నీరచనయు నీవు, మొదటనే నాలుగు విరుపులా" యని మాట ముడిచెనఁట. సూరన్న రోషముఁ దెచ్చికొని మిగిలిన మూఁడుపాదములును, నొకటే సమాసమున వెళ్లఁబొడెనఁట. ఇది ఒక గాథ. మనకవులనుగుఱించి యిట్టికాళ్లులేని కథ లెన్నియో యున్నవి. అసలు పెద్దన్న సూరన్నలకు సంబంధ ముండెనో లేదో, యున్న నది యేపాటిదో మన మెఱుఁగము కాని, యీగాథ యొక విశేషమునకై పుట్టియుండును. సూరన

శైలి లలిత గంభీరము. మృదుమధురము. తిక్కన్నచాయలు సాధారణముగఁ గానిపించుచుండును. కొన్నియెడల నప్పటప్పు సరుకే దించినాఁడా యనియు సందేహము గలుగును. శ్రీనాథుని "ఘనఘనాఘన గర్జానిర్ఘోషములఁ" బోలు రచనలును నరుదుగఁ దట్టును. పెద్దనసమాసములలోఁ బినవీరభద్రుని మేలిమి యున్నది. పోతనతరువాత సంస్కృతపు సమాసముల నచ్చుకట్టుకు దించి, నయమగు చాయ నిచ్చిన దీతఁడే. పెద్దనలోని పనితనమే సూరనయందును గిరికొన్నది. మఱల నింత లలితగంభీరములగు సమాసముల వాడినవారు లేరు. పెద్దన సమకాలికుఁడగు ముక్కుతిమ్మన కీవాసన కొద్దిగ నంటినది. చేమకూరవాఁడు వాడినచోట మధురముగనే యుండును. కాగా సూరన కవిత్వమును గుఱించియే యీగాథ నల్లియుందురు. అతని తెనుఁగులు వజ్రపుఁ దునుకలు. తెనుఁగు సమాసములు నిడుదలుగా నేర్పరచి కూచిమంచి తిమ్మనవలె రసాభాసముఁ జేయఁడు. మధురములై సన్నివేశమునకు సరిపోవు పూమొగ్గల వంటి తెనుఁగులే వాడును. సూరన్న సంస్కృతసమాసములు కంచుమ్రోతవలె విననింపుఁ గలిగించును. రాయని కవితయందువలె భావనూతనత లేదు. ఆధర్మ మితనికిఁ జాల తక్కువ. కాని, సామాన్య భావములఁ దనపలుకుపొందునఁ గూర్చి తనవే యనిపించు చిత్రవిద్య యీతనిది. పండితుఁడు మాత్రమేగాఁడు; ప్రపంచమెఱిఁగిన

ప్రౌఢ. అనుభవశాలి మాత్రమేగాఁడు; అనుభవము నక్షర మూర్తితో జోడించి యానందించిన రసికుఁడు. అలంకారము, భరతశాస్త్రము, తర్కమీమాంసలు, ధర్మశాస్త్రము లన్నిటికీ జేయి వేసినాఁడు. కలముఁ బట్టినపుడన్నిఁటికిఁ దొలఁగి నిలిచి నాఁడు. నిజముగ గొప్ప సంస్కారముగలవాఁడు సూరన్న.

తక్కిన యుత్కృష్టగుణము లటుండ నితఁడు ముఖ్యముగఁ బాటించినది యౌచితి. పాత్రముల నాడించు సూత్రధారి యితఁడు. ఇతఁడు చెప్పినట్లు, చూపించునట్లు వేషము లాడుచుండును. ఆనదాఁటిన "కోదండశిక్ష" తప్పదు. కొలిచి చూపిన ట్లీతఁ డౌచితీసన్నివేశమును జూపించినపు "ఔరా! ఘనిత"మని యాశ్చర్యము గలుగును. సూరన్న గొప్పమేధావి యని యప్రయత్నముగ నాలుగులొట్టలు వేయవలసివచ్చును. నాకపురాధీశ్వరుఁడగు దేవేంద్రుఁడు ద్వారకను దూరమునుండి చూచినాఁడు. చాల నాశ్చర్యకరముగ నున్నది. "అతని వేయి కన్నులును జాలక వెఱగుపడినాడట", కాని యాధీరోదాత్త చక్రవర్తి యొక్కసారి "శిరఃకంపంబు" నేసినాఁడు. మనవంటి సామాన్యుఁడు గాఁడుగదా దేవేంద్రుఁడు—కొంచె మాశ్చర్యమైనవెంటనే గ్రుడ్లుమిణుకరించి నాలు కల్లార్చి శరీరము కొయ్యఁబాఱఁ జెమటచే గుడ్డలు తడిసి బీభత్సమూర్తియగుటకు. ఆ రాజసమూర్తి శిరఃకంపము వేయిభావములఁ గూర్చుకొన్నది

"నిలింపవల్లభుని పెంపుఁ బరికించిన" మాతలియు "కించి దుల్లసిత లోచనుఁ" డైనాఁడఁట. ఈ రెంటినిఁ బరికించుపాఠకుఁ డౌచితీ నిర్వహణమునందు సూరన దృష్టి యెంత గంభీరమైనదో తెల్సు కొనవచ్చును. కవి స్వతంత్రించి పలుకుచోటులలోఁగూడ సూరన్నకుఁ జాపల్యము తక్కువయే కథోద్వేగమున కడ్డుఁ గలిగించి ఛీ యనిపించు తెగబారెడువర్ణన లెక్కడను జేసిన వాఁడుగాఁడు. ఇంద్రుఁడు కృష్ణభగవానుని జూచినపుడు మన కవుల సంప్రదాయము ననుసరించి యొక యిరువది స్తుతిపద్య ములు విసరవలసియుండెను. కాని మహాకవియగు సూరన్న యనుచితత్త్వమునకు శంకించియే ముందు కరిగెను. కృష్ణుని యజ్ఞవర్ణనముఁగూడ మట్టసముగ రెండు పద్దెములలోననే ముగించినాడు. సమయము దొరికినఁ జాలు'రాయని వీరావేశ మెత్తి విసరురోగము మనకవికిఁ జాలతక్కువ. శుచిముఖి ప్రభా వతిని వర్ణించు ఘట్టమున మాత్రము రెండు దశకము లెంచి వ్రాసినాఁడు. రసికతాలోలుపతచేఁ బాపము! స్తనజఘనాదులఁ గూడ మఱచినవాఁడు గాఁడు. ఈ ప్రభావతీరూపము నంతగా వర్ణింపకున్న ప్రద్యుమ్నుఁడు పెండ్లికొడు కగునా మఱి!

కాఁగా - సూరన్నయం దౌచిత్యజీవుల కుండఁదగు అవ శ్యముగానుండు, మంచిచెడ్డ లన్నియుఁ గుదురుకొన్నవి. వీరికి "విలీనత"యను ధర్మము తక్కువ యని నాకుఁ దోఁచును.

ఆవేశము ఔచితి యనునవి పరస్పర విరుద్ధములగు శక్తులు. ఆ రెంటిని సమన్వయించుకొనువాఁడు మహాయోగి గావలెను. నాదృష్టి కొక్క తిక్కనయందుఁ దప్ప నితరులయందీ సమన్వయ శక్తి యంతగఁ గానరాదు. సంస్కృతమునను జాలమందికీ ధర్మము దక్కువ. ఆ "విలీనత" యనునది దక్కువగుటచేతనే కొన్ని గంభీరములగు ఘట్టములయందు హేతువాదము నొందదలగు తేలికపనులు బయలుదేరును. పాత్రలయెదుట నిలిచి వెక్కిరించిన ట్లుండును. ప్రద్యుమ్నుఁడు విరహావేదనచేఁ బొరలుచున్నాఁడు. అతని దృష్టికి సర్వము ప్రభావతీమయముగ (౩-౧౮) నున్నది. వానితోఁబాటు విలీనులమై మనమును వాపోవుచున్నాము. అట్టియెడ కవి మధ్య నిలిచి "నెఱయంగ నిదిసుమీ - యొకటిఁ గోర వేఱయొకటియగుట" యని హెచ్చరించి మనభావన కడ్డువైచి తట్టి లేపుచున్నాఁడు. ఈ ఘట్టమునే సూరన్న తిక్కన మహాకవి ననుసరించి తీర్చిన పద్య మొకటి గలదు. రెంటిని పరామర్శింతము గాక—

"తరుణికెంగేలంచుఁ దమిఁ బట్టి కటకటా
చిగురాకె యిది యంచుఁ జిన్నవోయి
వెలఁది పాలిండ్లంచు వెసనంటి చెల్లఁబో
పూగుత్తులే యంచుఁ బొలుపు దఱిఁగి
చెలువ పయ్యెద యంచు జేసాఁచి, యయ్యో! ప
రాగోదయమె యంచు రహిఁ దొలంగి

రమణి వేనలియంచు రతికాంక్ష నొడిపి హా
     లేటి మొత్తమెయుంచుఁ జెల్లఁబోటి
యకట యనిమిత్త కృపఁ దాన యరుగుదెంచి
హితవు సెఱపెడి హింసిలో హృదయ మిచ్చి
పలుకని కృతఘ్నునకు నాకుఁ బ్రాప్తమగునె
యట్టి యంపతిపొం దనుచుఁ దా నాత్మఁగుందు"

(౩-౨౧)

విరాటపర్వమునఁ దిక్కన కీచకు నున్మాదిగఁ జేసివైచి వాని యవస్థ నీరీతి వర్ణించినాఁడు—

"పొడసూపిన ట్లైన పడిఁ బట్ట సమకట్టి
     పరికించి కానక బమ్మరించు
మెలఁగిన యట్లైనఁ బలికింపఁ దలఁచి ని
     రూపించి లేమి నశ్రులు వహించు
గదిసిన యట్లైనఁ గౌఁగలింపఁ గడంగి
     యారసి బొంకైన నలఁత నొందు
నొడఁబడ్డ యట్లైన నడరి పైకొనఁ జూచి
     చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయుఁ
లలిత వివిధ విహారంబులకు లతాంగి
యెలసి సొలసినయట్లైన నెలమిఁ గలసి
యభిమత క్రీడ సలుపంగ నప్పళించి
వెదకి రిత్త బయల్గని విహ్వలించు"

(౨-౩౦౦)

తిక్కన పద్య మమృతమధురముగ నున్నది. పాషాణములఁ గరగించు శక్తి ప్రత్యక్షరమునను నిండి తొణికిసలాడుచున్నది. అతఁడు భావమును నడపుటయందు పాటించిన క్రమము మహత్తరమై, గభీరమై, అనిర్వచనీయ మహిమా విశోభితమై పాఠకుని హృదయ పుస్తకమున మాసిపోని మదనాస్త్రమై నిలుచుచున్నది. సూరన్న పద్యమో - వెక్కిరించినట్లున్నది. శాఖాచంక్రమణము, అక్రమము గిరికొన్నవి. అంతకుమునుపు మన కన్నులఁగారిన కొంచెము కన్నీరు నీ పరిహాసచిత్రముతో నిమిరిపోవును. ఇట్టి పట్టు లెన్నియో గలవు. మచ్చున కొకటి చూపితిని. ఇఁక నీతని పరమూర్ధమగు నౌచితి నెంతవఱకు సాధించెను ? ఇతని కళాపూర్ణోదయముకన్న - ప్రభావతీ ప్రద్యుమ్నమౌచిత్యమున నొక మెఱుఁగు దక్కువ. మొదటిదానిలో లేదు - రెండవదానిలో లేదు——ముసలిముప్పున మూఁడవదాని కంటినది శాస్త్రపుఁ దెవులు. బహుశః వార్ధక్యము రెండవబాల్యము గదా! అందుకేనా యింత చాపల్య మణచుకొనలేకపోయినాఁడు? ఇతని ప్రభావతి సామాన్యురాలుగాదు; శాస్త్రములు గాలించినది ; అడుగడుగున కొక మీమాంసా న్యాయము వల్లించని దామెకు నిద్రరాదు! ప్రద్యుమ్నుఁడు పడకటింటి కాలస్యముఁ జేసినాఁడు. అపు డెన్నియో సంశయము లామెహృదయము నాక్రమించినవి. అందులో నామె

గౌరీపూజఁ జేయునపుడు - కర్తృకర్మ వ్యత్యాసము గలిగెఁ గాఁబోలు (3-83) నను ననుమానమే పెద్దదై కూర్చుండినది. శుచిముఖితో మాటాడుచు "సఖ్యము సాప్తపదీనము గదా" యని ధర్మశాస్త్రపుఁ దస్త్రము విప్పినది. ఆమె గురువెవరో యెన్ని యేండ్ల విద్యాభ్యాసమో మనకుఁ దెలియదు. ఏమో! దేవతల శాంబరీవిశేషము మన మెఱుఁగఁ దగుదుమా ?

అసలు ప్రభావతి పుట్టుకయందే కనుకట్టు విద్యగలదు. గౌరీవరముననే యామె జనించెనఁట. ప్రద్యుమ్నునిపై "మోజు" పడుటకుఁగూడ, గౌరీదేవియే కారణము. చక్కనిమగని వెదకిన దా పెద్దముత్తైదువ. ఒకనాఁడట ప్రభావతి నిద్రపోయినదఁట. గౌరీదేవి స్వప్నమున సాక్షాత్కరింప కుండునా ? రానేవచ్చినది. ప్రేమతోఁదల నిమిరి తా నదివఱకు దయతో దాచుకొనివచ్చిన యొక వర్ణచిత్రము నొసఁగి "బిడ్డా! ఈ చిత్రమున నున్నవాఁడు నీమగఁడు. వాఁడీపురినేలు"నని చెప్పి మాయమైనది. అదివఱకుఁ బిలువని పేరంటమున కాశ్చర్యపడుచుండిన ప్రభావతికిఁ బెనిమిటిపేరు చెవిసోకినంతనే పరమానందమైనది. శివ మాయమైనది. చిత్రముమాత్రము మిగిలినది. అది నేరుగ భవానీదేవియే వ్రాసినదఁట. పైగ వేకువజామునఁ గలిగిన కల గావున 'శీఘ్రఫలప్రదము, ఖండితము' నని చెలికత్తె యాశీర్వదించినది. మన

కేమియుఁ గథాభాగము మిగిలించలేదు సూరన్న; అంతయు ముసుఁగులోననే ముగించినాఁడు.

చిత్రపటముఁ జూచినతరువాతఁ బ్రభావతికి విరహము గలుగ కుండునా? కలుగకున్న మనకవ్వు లుండనిత్తురా! అది లేకున్న ప్రబంధమే గాకపోయెను. అలంకారికులు గీట్లు గీచి నారు గదా! పటముఁజూచినది మొదలు - పట్టినది దయ్యమము. "ఆత్మసంకల్పవాసనావిశేషవశంబునఁ" జిత్రమును జూచి చూచి పలుపోకలు పోయినది. కందర్పరాగము డించుపదుట నుద్యాన వనమునకు వచ్చినదఁట వచ్చియూరకున్నదా? ఊరకున్న ప్రబంధము పూర్తియగునా? "నిజేశు" రూపమును జూచి కన్నీరు గార్చినది. "అయ్యో వాఁడు నా సరసకు రాకపోయెనే" యని యాకాంక్షించినది. వానితో ననగిపెనఁగు భాగ్యమే పట్టినచో నప్పటి రసభావము లెట్లుండునోయని లొట్టలు వైచినది. ఔరా! వలపు! ఆమెకు వాని యూరు పేరు దెలియదు. కులశీలము తెలుఁగదు. అసలు అట్టి పురుషుఁ డున్నాఁడో లేఁడో యను సందేహముగూడ (3-82) నామెకు లేకపోలేదు. అట్టిచోఁ బటమును జూచిన మరు నిముసముననే కాకరకాయవంటి పుల కలు చనుకెలఁకుల మొలచునా? ఎంత దానవకాంత యైనను నింత తామసము దగునా? ఎంతటి యసభ్య మీ వర్ణనము! పాప మామె యూర్చి యూర్చి కాంతాళమునఁ బొరలినదఁట.

సూరన్న కీ మాత్రము దెలియకుండెనా? ఇట నౌచిత్య మెంత పాడయినది! ప్రభావతి రాకొమరిత. చిననాఁటనుండియు వైభవములనే యనుభవించినది. ఆనాఁటి సౌందర్యవంతు రాంద్రలోఁ బోలుత నిలుచునది ప్రభావతి. రతి సొబగుకన్న ప్రభావతీ రూపసౌందర్యము ముమ్మడి యఁట. ఎట్లున్నను నామె చక్కనిది. వైభవములతోవచ్చు నహంకృతి యుదాత్తత యామెకు రేఖగానైననుండదా? అట్టియెడఁ గేవల చిత్రదర్శనముననే చిత్తము నప్పగించు వికలస్వాంతయా యామె? కన్నీరు గారిన దఁట. శరీరము శుష్కించిన దఁట. ఊర్మికలు కంకణము లైనవఁట. చెక్కులు తెల్లనై యీడ్చుకొని పోయిన వఁట. ఏమి యొయ్యారము! మగవారి సోకోర్వరేమో ప్రబంధ కాంతలు! అతిశయోక్తి యని యాలంకారికు లెంత నీరు దట్టి నను నింత వికటతాండవము రసాభాసము గాకుండునా? మన వారి కివి రసాభాసములు గావు గాబోలు. ముక్కుకు సూటిగ నడచినఁజాలును. నడుమ నెన్ని వంకరలున్న నన్నిటికిని "మాఫీ."

చదురులపులుఁగు శుచిముఖి వీరి వెనుకనే యున్నది. వీరి వాహ్యాళి యంతయుఁ జూచినది. ప్రభావతి సోలుట, రాగవల్లరి పట్టుకొనుట, ఆమె హా యనుట, యీమె యయ్యో యనుట పెద్ద గందరగోళముగ నున్నది. ఇంకను నేమి జరుగునో యని యట్లే కాచుకొన్నది. ప్రభావతీదేవి తనయవస్థ

నంతయుఁ బసవినది. చిత్రపటములోని వాఁడే నాయకుఁ డగునని ప్రతిన పట్టినది. ఇంతవఱ కూఱకుండిన శుచి ముఖి యిఁక కార్యము సాగ దని తిన్నగ రంగములోనికి దిగి నది. చిత్రమును బరిశీలించు వడువున వారికంటఁబడినది. నిజ ముగ శుచిముఖి పరమాద్భుతసృష్టి. కవి తనదృష్టి నంతయు శుచిముఖిపాత్రముననే లగ్నము గావించినాఁడు. తక్కిన వంత పసందుగఁ గుదురలేదు. దొడ్డిదారిఁ బడినవి. చిత్రమును జూచిన శుచిముఖి వెంటనే ప్రసంగమునకు దిగక కొంత యాదువారి బిగుమానముఁ జూపించినది. ప్రభావతీ రాగవల్లరు లూర కుందురా? ఆమెను మాధ్యస్థ్యమునకుఁ బిలిచినారు. పిలువని పేరంటము గాదనుకొన్నది. తిన్నగఁ బ్రసంగముఁ దిగిచినది. తాను వెంటనే గుట్టు బయటఁబెట్టలేదు. చమత్కారముగ వారి మనసులలోని కోరికను రాఁబట్టుకొన్నది. కడకు వాఁడు ప్రద్యుమ్నుఁ డనియు, వానికి రతియను భార్య యొకతె యీ వఱకే యున్నదనియు, యాదవుఁడనియు విలాసమును బూర్తిగ నొసఁగినది. పట్టుదొరకకముందే పరవళ్లు ద్రొక్కుచుండినది ప్రభావతి. ఇంతమాత్ర మవకాశము దొరికిన నడుగవలెనా? చూడుఁడు. ప్రారంభించినది యుపన్యాసమును.

"ఆరలికిఁ గరంబు లైతిరే నవ్విభుఁ
గౌఁగిలింపఁగ నబ్బు కరములార!

యా యింతికిఁ గుచంబు లైతిరే నతని న
ఖోనిపీడన మబ్బు కుచములార!
యీ లతాంగికిఁ జెక్కులైతిరే నారమ్య
శీలు చుంబన మబ్బుఁ జెక్కులార!
యీ నెలఁతకు వీనులైతిరే నా కళా
విదు మంత్రనము లబ్బు వీనులార!
యట్లు గానోచ కేల నాకైతి రకటట
యని నిజావయవంబుల కాత్మ వగచు;
బాల్యమునఁ దన్ను రమణసౌభాగ్యకలిత
యనిన సాముద్రికులమాట లరసి తిట్టు" (3-౧౦౫)

ఇంతకన్న నసహ్యాపువర్ణన మే వ్రాఁతగాఁడును వ్రాయ లేఁడు. సూరన్న యుత్తమకవి. ఆతఁ డెందులకో యీ నికృష్ట రచనకుఁ గడంగినాఁడు. అందులో నేమి హాయి గలదు? ఓ చేతులారా! ఓపాదములారా, ఓ చెక్కులారా! ఓ పక్క లారా! అని యెవ్వరైన వాపోవుదురా? సామాన్యమన స్తత్త్వ మునకుఁ గూడ భరింపరాని దీ వ్రాఁత. అట్టియెడ రాజకుమారి తయు నుదాత్తయు నగు ప్రభావతి యిట్టి తలతిక్కమాటలు పలుక నగునా? ఈ గడబిడలోఁ దన్నుఁగన్న నాయనకుఁ గూడ నాలుగు పూజానామములు వడ్డించినది (3-౧౮౩). ఇది యెక్కడి పడుచుదనమురా దైవమా! ప్రపంచమును దల్ల క్రిందుఁ గావించుచున్న దీ యార్భాటము!

ఆమె విలాపమంతయుఁ బూ_ర్తియైన తరువాత, పండితు రాలగు శుచిముఖి శాస్త్రీయముగ (౭-౫౦) నోదార్చినది. కాని ప్రభావతీప్రద్యుమ్నులఁ గలుపుట యెట్లు? అయ్యవారు ద్వారకలో అమ్మవారు వజ్రపురిలో; ఎన్నాళ్లీ విరహాగీతికలు? శుచిముఖి యొక చక్కని యుపాయ మాలోచించి చెప్పినది. శుచిముఖి మహాపండితురాలని చెప్పి యెట్లులైననుఁ దన్ను వజ్రనాభునెదుటఁ బడవేయుమన్నది. ప్రభావతి "బలే! సెబా" సని యాపనికిఁ దానే యొప్పుకొన్నది. ఇంతేగాదు సుఁడీ. తొలిరతినాఁడు పానుపు తానే స్వయముగ సవరించిన దఁట. చక్కని వారకాంత ప్రభావతి. శుచిముఖియు నీసంతోషవా_ర్త నప్పుడే ప్రద్యుమ్నున కందఁజేసినది. ప్రభావతియుఁ దిన్నగా నాయన గారికి శుచిముఖి వృత్తాంతమునుజెప్పినది. వాఁడును రానిమ్మన్నాఁడు. శుచిముఖి యసాధారణమేధాశాలిని గదా! అతనితో భద్రనటుని వృత్తాంతమును గూర్చియు, వానినాట్యమును గూర్చియు విశేషముగ ముచ్చటించినది. వానిని బిలిపించి దేవర వా రనుగ్రహించవలెనని ప్రార్థించినది. రాక్షసేశ్వరుఁడు వల్లెయని నాఁడు.

ప్రద్యుమ్నుఁడు గుఱ్ఱముపై గంతు లేకనే యెగురు వాఁడు. ప్రభావతికిఁ జిత్రపట దర్శనమైనను కలదు. వాని కదియు లేదు. వానిది కేవలము వినుకలివలపు. "ఉపమాతిశయో_క్తికామధేను"వగు శుచిముఖి వానియెదుటఁ బ్రభావతి

నూఱక తనివి దీర వర్ణించినది. దానితోఁ జిల్లుదిరిగినాఁడు ప్రద్యుమ్నుఁడు. ఎడద కంటిన వేదురుతోఁ దల పిచ్చియెత్తినది. చిలుకలను కొంగలను పిట్టలను వజ్రపుర ప్రయాణమునకై యాచించినాఁడు. వజ్రనాభునితోడి యుద్ధము-ప్రభావతితోడి యుద్ధము నొకయెత్తుగ భావించినాఁడు. అప్పటివానిభావము లివి.

సీ. "అమరారి కరుల గుంభములు వ్రయ్యఁగ మొత్త
 రమణి చన్నులు నఖాగ్రముల నొత్త
సమద రాక్షస రథ చక్రంబు లిలఁ గూర్ప
 గాంతశ్రోణికి నూడిగంబు సల్ప
అసురేంద్ర జయశంఖ మవని పై వ్రేయింపఁ
 గామినికంఠంబు కౌఁగిలింప
వజ్రనాభుని ధనుర్వార్తలు గడ తేర్పఁ
 బడఁతికన్నోమసంజ్ఞఁ బను లొనర్ప."

ఇట్టివాఁ డాలస్యమున కోర్చునా? శుచిముఖి రాలేదే యని దిన మొకయేడుగఁ గడుపుచున్నాఁడు. ఆమెయు వచ్చి సముచితముగఁ గృష్ణునితో మాటలాడినది. ఒకవేళఁ గార్య మెట్లు పరిణమించునో యని గదసాంబులను దోడిచ్చి గోపాలుఁ డనిపినాఁడు. "సర్వీసుదారు" గదా గోపాంగనావల్లభుఁడు. అతనికిఁ బదునాఱువేల భార్యలట. వారందఱును స్వామికి "ఉడుగరలు"గా వచ్చినవారే. అందఱితోఁ గాపుర మెట్లీడ్చెనో యా సనాతనబ్రహ్మచారి; ప్రద్యుమ్నుఁడును

టాకుటీకుగఁ బ్రయాణ మైనాఁడు. తండ్రికొడుకులకు సైగకు సైగ. శుచిముఖి వజ్రపురమునకుఁ బోవుత్రోవలోఁ బెండ్లి కొడుకునకు నీతులు గఱపినది. భద్రవేషము తయారు. అంతఃపురములోని 'థియేటరులోఁ' బ్రవేశనము. రాజుగారు రాణిగారు దయచేసినారు. ప్రభావతమ్మగారు హాజరు. ప్రద్యుమ్నునినాట్యము పరమాద్భుతముగ నున్నది. అందఱు సంతసించినారు. రాజుగారు మూరెఁడు పెరిగినారు. ఆ యూకలో నాయకుఁడు ప్రభావతిపై నొక కడగంటిచూపు విసరి చమత్కారముగ తీమూపణఁ జెప్పుకొన్నాఁడు. ప్రభావతిగారును దానిని చక్కగా "అడ్మైర్" చేసినారు. ఆట ముగిసినది. అంద ఱింటిదారిఁ బట్టినారు.

ఇఁక మిగిలినది ముఖ్యనాటిక. ప్రభావతి చక్కఁగ నలంకరించుకొన్నది. చాల కులాసాగ నున్నది గదా! పడక టిల్లు సవరించినది. వాసనాద్రవ్యములు, పూలు గీలు స్వయముగ నేకరించినది. ఇంకను నాథుఁడు రాలేదు. ప్రొద్దుపోవు టెట్లు? శుచిముఖి రాగవల్లరు లంతల నింతల లేరు. చంద్రదూషణాదులను బ్రారంభించినది; ఒకయరగంట గడుప వచ్చును గదా మఱి. ప్రద్యుమ్నుఁ డీమెతలలోనే తుమ్మెదయై యున్నాఁడు. వాఁడును మహోద్వేగములో నున్నాఁడు గదా. పాపము! ప్రబంధనియమ మడ్డువచ్చినది. చంద్రదూషణాదులు ముగియనిదే ప్రవేశించిన ప్రబంధత్వము

పట్టదేయని ప్రాణములు బిగఁబట్టి యట్లే నక్కినాఁడు. ప్రభావతికి వేసరిక వచ్చువఱకు బద్యములు విసరినది. ఆమె మాత్రము నిలుపక తిట్ట గలదా? సుకుమారి గదా! కొంత సేపటికి కలసి 'ఇంటర్‌వెల్' దీసికొన్నది. "సమయము దొరకె, పద దేవుఁడా" యని నాయకుఁడు గప్పున దూకినాఁడు. ఇంతవఱకుఁ దహతహలాడిన పిల్లివంటి ప్రభావతి మగనిదర్శన మైనవెంటనే యుచ్చాటన మంత్రముఁ బఠించినట్లు చఱ్ఱున లేచి యుఱికెనఁట! ఆయింతలోననే యలముకొన్నది మీఱరాని మేరలేని సిగ్గు. ఔరా! యేమి యౌచిత్యము. సమయము మించిపోయె నని రాగవల్లరీశుచిముఖులు వెంటఁ దగిలినారు. ప్రభావతి యీడిగిలఁబడినది. ప్రార్థించినది. కంబముఁ బట్టుకొని నిలిచినది. తాను ముగ్ధ ననుకొన్నది పాపము! ఏమేమో నటింపఁబోయినది. ఆమె మహా చమత్కారిణి గదా యొక్కొక్కప్పుడు! కడకు శుచిముఖి చేయిపట్టి యీడ్చుకొనివచ్చినది. "ఏనుఁగుఁ గంబానకు దిగిచి నట్లుండె"నఁట నావ్యాపారము. శుచిముఖి వధూవరుల చేతులఁగలిపి "అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు" అని చెలఁగి నవ్వినది. ప్రద్యుమ్నుని, ప్రభావతిని వదలి సకియలు వెళ్లినారు. మొదట నలసప్రవృత్తియు లజ్జాలోలతయుఁ గల ప్రభావతి రానురాను ప్రతివీరుఁడై నిలిచినది. ఆ రాత్రియంతయు నేవిఘ్నమును లేక వారి కన్నెరికపు రతి

చెలఁగినది. ప్రద్యుమ్నుఁడు భూవివర మేర్పఱచినాఁడు. ప్రతిదినము రాకపోకలు జరుగుచుండినవి. ఇది చాలక ప్రద్యుమ్నుఁడు తన తమ్ములకుఁ గూడ ననుకూలములు గల్పించినాఁడఁట. ఔరా! యెంత చక్కని యౌచిత్యము!

ప్రద్యుమ్నుఁడు భూవివర మేర్పఱచినాఁడు గదా' అతఁడు ప్రతిదిన మావివరమార్గమున వచ్చుట, 'ప్రజెంటు' పలికి పోవుట ఇట్లు కొన్నిదినములు జరిగినవి. అమ్మగారికి దిన దినము చీకటితప్పు చిన్నెలు పరిశీలించుకొనుటయందును! వింతవింతగా నలంకరించుకొనుటయందును సరిపోయినవి. గర్భము తయారైనది. చిన్నప్రద్యుమ్నుఁడు అచ్చుపోతలో నున్నాఁడు. గుసగుసలు, సవసవలు ప్రారంభమైనవి. ఈవార్త బైటఁ జెట్లినది. వజ్రనాభుఁడు మండిపడినాఁడు. ప్రద్యుమ్నుఁడు వజ్రనాభునకు "మదిచ్ఛఁ గైకొంటి నీకుమారిత పొందుగ" అని సమాధాన మిచ్చినాఁడు. ఇది యెంతపఱకు ధర్మమో నీతిమంతులు విచారింతురుగాత! ఇక ప్రభావతియా, తనతండ్రిని నరుకుటకుఁ దానే కరవాలమెత్తి యిచ్చినదఁట. పైన బాగుగ నరకుఁడని యాశీర్వాదము. ఔరా! ఔచిత్యము. స్త్రీ హృదయ మింత శుష్కమైనదా! ఒక్క నిట్టూర్పునకుఁగూడ గతి లేదయ్యెనా! అంత వెట్టివల పుండునా? పరమరాక్షసిగా నున్నదే ప్రభావతి! కన్నతండ్రిని నరకునపుడు కుల్లీ కుముల వలెనా, వెనుక నిలిచి తప్పటులఁ జఱచవలెనా? అసహ్యముగ

నున్న దీఘట్టము. ప్రభావతియం దేగుణములును పరిపూ_ర్తిగ లేవు. మీఁదు మిక్కిలి చెఱచినఘట్టము లెక్కు_వ. మొదటి నుండియు బోగముదాని చిన్నలే కనబడుచున్నవి గాని— "యప్పటము" రాజకాంతవలె లేదు. కలభాషిణివంటి మధుర మూ_ర్తిని సృష్టించిన యమృతహ_స్తము ప్రభావతివంటి రాకాసిని సృష్టించె ననుట నమ్మఁదగినది గాదు. శుచిముఖి పాత్రపై సంపూర్ణదృష్టి నుంచినాఁడు ఁచయిత. తక్కి_న వానిని జెఱచినాఁడు. నడుమ నడుమ శాస్త్రపుటూకదెబ్బలు. శుచిముఖి వంటి నిత్యవర్చస్విని యెదుట ప్రభావతి పరిహాస చిత్రముగ నున్నది. కలభాషిణి వారకాంత యైనను సీ యభి సారికకన్న ను_త్తమురాలు.

సూరన్న మహాకవి. చరమదశయందుఁ గవిత్వము ముదురుపాకమునఁ బడె నంతే. పాపము! విందులు చేసినాఁడు. భక్ష్యభోజ్యములు గడుపునిండ నారగింపఁజేసి కడకు గొంటు వక్క_ తాంబూలా మిచ్చినాఁడు.

---

# ప్రబంధనాయికలు

## వరూధిని

అన్యభాషలగతి యెట్లున్నను నాంధ్రముయొక్క హాని వృద్ధులకు రాజుల చిత్తవృత్తియే ముఖ్యకారణము. మన దేశమున - నందును తెనుఁగునాట - రాజులు కవులను బోషించుట, వారితో గ్రంథములు వ్రాయించి కృతినందుట మొదలగువానిని వీడరాని ముఖ్యలాంఛనములుగ గ్రహించియుండిరి. ప్రబంధము వ్రాయింపని పాళెగాఁడు లేఁడు. కృతినందని కోశాధికారి లేఁడు. ప్రతియొకఁడును నంతో యింతో భాష నాదరించి తమకును గవు లున్నారనిపించినవారే. కవులును దేశకాలపాత్రముల ననుసరించి యవసరమైనప్పుడు తక్కువ బేరములకే దిగినారు. నిండుసభలో స్వర్ణాభిషేకము నందిన కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడే యొక మహాగ్రంథమును వాసనాద్రవ్యముల నొసఁగు అవచి తిప్పయ్యశెట్టి కంటఁగట్టినాఁడఁట. ఇతరుల నడుగ నక్కఱ యున్నదా? లోని దొసఁగు లెట్లున్నను రాజుల యౌదార్యము మాత్రము మెచ్చుకొనక తప్పదు.

ఆనాఁటి రాజులలో నెవరో దప్ప సామాన్యులందఱును పదము మఱచిన దాసరయ్యలే. పుట్టుకనుండియే సుఖ మొకటి వెంటఁబడియుండుటచేఁ గాలుసేతులు గదలింప లేని—కడకు త్రోవను గూడఁ జూడలేని సోమరులైనారు. ఈ యరిష్టమున కింతయో యంతయో దొలఁగి నిలచినవారు రణభేరి మ్రోయించినారు. నిరంతరము వీడరాని సుఖపిపాస. లాలసత దప్ప మఱేదియు రాజుల జీవితములలో నుండలేదు, విద్యాగంధము లేకుండుటచే నయము - నీతిలేని భోగము- పాత్రతలేని త్యాగము - వారి దైనికజీవితమునఁ దప్పని ముప్పులు. ఇంక నిట్టివారికిఁ గవులు దొరకిన వారి యవస్థల నే మని చెప్పవలెను? కోతుల కద్దము దొరకుట వంటిదే! వారిని తమమనసునకు వచ్చినట్లు వినియోగింపసాగిరి. తా ముంచుకొన్న సానిపై నొక గ్రంథము, తమపై నొక ప్రబంధము. వేయేల? తమదగ్గు, తుమ్ము సర్వము కావ్యవస్తువులే యైనవి. మనకవులకు బత్తెమిచ్చువారె రాజులు గదా! వారి యాజ్ఞచొప్పున మెలఁగనిచోఁ బొంతకుండలు పొర్లాడ వలసినదే. కాన, వారు గూడ తమచిత్తవృత్తు లేరీతి నున్నను, "అన్యథా శరణం నాస్తి" యని పాలకులనే యనుసరించిరి. వారికి నచ్చినత్రోవనే వ్రాసి మెప్పించసాగిరి. ఔచిత్యమున్నను వలసఁబోయినను, రసమున్నను లేకున్నను, అష్టా

దశవర్ణనలు లేనిది కావ్యము గాదయ్యెను. నాగదాళి చుట్టు కొన్న పల్లెను వస్తువుగఁ దీసికొన్నను, అభేద్యప్రాకారములు గట్టవలసినదే. కడకు కవిత్వ మనఁగా కవి మనస్తత్త్వముతో సంబంధములేని, రసములేని మఱి యేవిధమైన సౌందర్యము గానిలేని యసహ్యపదార్థముగఁ దయారైనది. విజయనగర రాజ్యానంతరము దానికిఁ బట్టిన యవస్థ మఱింత దుర్భర మైనది.

అయిన రాజులందఱు నింతే యనియు, వారిదే తప్పం తయు ననుటయుఁ బొరపాటు. మహానుభావులగు రాజ కవులు కవిరాజులైనారు. సర్వజ్ఞసింగమనాయఁడు, కాక తీయులు, విజయనగరాధిపతులు మొదలగువా రుత్తమ విద్యావంతులే. రాయలు "సాహితీ సమరాంగణ సార్వ భౌముఁ"డఁట. యుద్ధకాలములయందును కవులను బల్లకీలలో నెక్కించి వెంటఁదీసికొని పోయెడివాఁడు. తాను స్వయముగఁ గవి. అయిన రీతిరంగములేని యంగడి కవి గాదు సుఁడీ. ఉభయభాషలయందు సమగ్రమైన పాండిత్యము చేతఁబట్టి, వ్యక్తిత్వమును వెలిఁగించి తక్కినవారికన్న విలక్షణతను నిలుపు కొన్న మహనీయుఁడు. అగుటచే రచనలోని పరమార్థ మేమో, దాన నున్న సాధక బాధకము లెట్టివో గుఱుతించిన మనస్వి. తక్కిన రాజధర్మముల యెడ నేరీతిఁ బ్రవర్తించినను వశ్యవాక్కులగు కవులకు మాత్ర మితఁడు దాసుఁడుగనే

మెలఁగినాఁడు. రాయల కళాభిరుచి యంతులేనిది. ఒక నాఁడు విలాసార్థము రాయలు తాతగారి నొక పద్దెముజెప్పఁ డని కోరిరఁట. పెద్దన్నయు ముసిముసి నగవులతో "కవిత్వ మంత తేలిక పదార్థ మనుకొంటివా?" అని కసరిరఁట. వీర కేసరియగు "మూరురాయరగండఁడు" సంతోషముతోఁ జీవాట్లను సహించి యూరకుండెనఁట. ఇట్టి ప్రభువు లభించుట మన పుణ్యమే. ఆతనియభిమానమే వరూధినికిఁ బరుషుఁ దీర్చిన దనవచ్చును.

నిజముగ నీకాలముననే పలనాటిచరితమువంటి, వీర గాథలు దండిగఁ బుట్టవలసియుండెను. కాని మన వాఙ్మయ మునకు శృంగారమొకటే వీడరాని చుట్టమైనది. అది వారి జీవితసూత్రముల ననుసరించి యుండునేమో యని నా యనుమానము.

ఇఁక పెద్దన యందమా? స్వయముగనే సౌందర్యాభి లాషి. ఒక పెద్దనకే గాదు; సౌందర్యమునకు లోఁగుట మనుష్యుల-ముఖ్యముగ కళారాధకుల యాంతరికతత్త్వము. దీనికిఁ దోడు జీవితము బాధాకులితముగాక, సంఘముగూడ నుద్రిక్తమైయుండక ప్రసన్నమై యున్నచో, మనసును శాంతిఁ బొంది సృష్టిలోని సౌందర్యమును బరీక్షించును; చూచి యానందించును; లేనిచోట కృత్రిమముగఁ గల్పించి యైనను జూడ నాశించును. కాళిదాసు రఘువంశమును జూడుఁడు.

మహాకవి పాడువడిన యయోధ్యను వర్ణించుచు పూర్వపు వైభవముల స్మృతికిఁ దెచ్చు సాకుతో వెనుకకుఁ బోయి యెచటనో దాగియున్న యభిసారికలను దోడ్తెచ్చినాఁడు. అజవిలాపమునందు చాతుర్యము తలసూపినది. "కవి జీవిత మునకును కవిత్వమునకును సంబంధము లేదు. అది యొక నగిషీపని. కవిజీవిత మెఱిఁగిన పిమ్మటనే కావ్యము బాగుగా నర్థమగు ననునియమములే" దని కొంద అందురు.

నా కీవాదముపై సంపూర్తిగ నమ్మకము లేదు. మన స్తత్త్వమును దాచి కవిత్వము నల్లగల మహానుభావులను నేను జూడలేదు. జీవితముతో సంబంధములేని మన సుండునా? అట్లు వాదించు వారియందును నా కీ పద్ధతి దోఁచలేదు. జీవిత మున కవిత్వము లేనిచోఁ గావ్యముననే యుండదనుకొందును.

రాయలవంటి రసికశిరోమణి నాశ్రయించిన పెద్దన జీవితమున లోప ముండునా? అతఁడు సర్వము సానుకూలముగ నమరిన గొప్ప యదృష్టవంతుఁడు. ఒకరికై యేడ్చుటయు మఱియొకరికై నవ్వుటయు లేక, హృదయమును మాత్రమే నమ్మిన స్వతంత్రుఁడు. నిజముగ మనుచరిత్రములోని కొన్ని కొన్ని సన్నివేశములు భావించినపుడు కవితాపితామహుని జీవితమెంత లలిత గంభీరమైనదో చూడలేక పోయితిమే యని కొండంత విచారము గలుగును.

ఆంతరిక మగు సహజ సౌందర్యాభిలాషకు మెఱుఁ

గిచ్చు జీవితమును సంపాదించుకొన్న "రేఖాశాలి" గనుకనే ప్రపంచమున సౌందర్యమునే భావించి శాంతినిఁ బొందఁగలిగినాఁడు. జీవితములోని శాంతి సౌందర్యములు కావ్యమున కెక్కినవి. నిలుకడతోఁ దీర్చిన పాత్రలు ప్రభాతకాలమునందలి లేఁడీఁగెలవలె తకతక మెఱసిపోవుచున్నవి. కళ యనునది రచయితకుఁ గల హృదయ పరిణతిని రసికతను వెల్లడించు సాధనము గాని పాండిత్యమును ప్రకటించి పాడుచేయఁ దగిన యొఱవుసొమ్ము గా దని గ్రహించిన విలాసి యగుటచే బుద్ధిపూర్వకములగు దోషములతోఁ గావ్యమును నింపలేదు. నన్నయలోని యావేశము, తిక్కనలోని యౌచితి, శ్రీనాథుని ధారాశుద్ధి ముఖ్యముగఁ గ్రియలసొంపు పెద్దనకవిత్వమునకు సాధనములు. ఈ కూడికచేఁ గొన్ని విలక్షణగుణములును పెద్దనలోఁ గుదురుకొన్నవి.

పితామహుఁడు తిక్కన నెంత జదివినను దనకుఁ గల చాపల్యమును మాత్రము వీడలేక పోయినాఁడు. ఒకటి రెండు మూఁడు చోటులలో శృంగార మస్థాన పతితమైన దనియే చెప్పవచ్చుచు. సాహితీప్రపంచమున రసములను బొమ్మలవలెఁ బట్టిపట్టి సముచితముగ నడిపించు సూత్రధార విద్య యెందఱికో లేదు. కొందఱికి పడకటింటి కవిత్వపు పస ఖడ్గముల కిణకిణలలో నుండదు. ఖడ్గములలోని వెచ్చఁదనము కొందఱికిఁ గౌఁగిలింతలలో దొరకదు. నాకుఁ జూడ నీశక్తి

సంపూర్ణముగ నొక కవిబ్రహ్మకే యబ్బినది. కాఁగా, మనము ప్రబంధముల విమర్శించునపు డీ "మార్జిను" కొంతవఱకు విడువక తప్పదు. కొన్ని గ్రంథములలో నా యస్థాన పతిత మగు శృంగారమును సముచితముగ లేదు. కేవలము బూతులు నిండినవి. అవి యన్నియు వారి జీవితములోని యవకతవక లే. దానికి మనము నిందించిన లాభము లేదు. ఒక శతాబ్దిలోని యభిరుచి మఱియొకదాన లేదు. నన్నయ శృంగారములోని పవిత్రత, యుదాత్తత ప్రబంధములకు లేదు. తిక్కనలోని "సహజత" తరువాతివారికి సున్న. ఆంగ్లమున "పోపు" కవిత్వము నిపుడు ప్రేమించువా రెంద అున్నారు? నన్నయ వలెనే యించు మించు చిత్రముల సృజియించు "రాసిటీ" కవిత్వము నిపుడు చదువుదు రా ? మన దృష్టి మాఱినది. సూటిగా మనస్తత్త్వమును బట్టియీయాయఁగల సన్నివేశములు దప్ప తక్కినవి మన కిపు డంత కాఁబట్టుట లేదు. ప్రతియొకటియు నింతే. రే పిదియు మాఱు నేమో, ఎవరు చెప్పువారు? మన మా వెక్కసములగు పట్టులయందు వారి జీవితానుభవ మట్టి దని శాంతించుట మంచి ది. "విషయేచ్ఛ" యని పండ్లునూఱినచో మనకు బాధతప్ప చచ్చినవారి కేయపాయమును లేదు గదా! అస లిందులో నంతయు మనదోషమే గాదు, మనచే ముప్పొద్దు ముడుపు లందుకొను దేవత లనుగ్రహించిన విద్యయే. కడుపుచింత

లేని చిరంతనరసికు లగుటచేఁ బరకచాటును గూడ మాని తమ రసికతను, చాపల్యమునుఁ దీర్చికొనుటకై ప్రత్యక్షముగ నొకజాతినే సృష్టించి రఁట. వారే మనము మాటిమాటికి విని వేసారిన యచ్చరలు. వారివి పదునాలుగు వంశములఁట. అందులో బ్రహ్మ స్వయముగఁ జేతితోఁ గాక మనసుతోడనే "దిద్దితీర్చిన" మానసిక సృష్టియు నొకటి. ఎంత యమృత మైనను దినము నదే భోజనమైన నాలుక తృప్తి వట్టదా? దానిని బాపుకొనుటకై విష్ణువు, మహేశ్వరుఁడు మొదలగు ప్రముఖు లంద అప్పుడప్పుడు "డిన్నరుపార్టీలు" చేయు చుందురు. అట్టియెడల అల్పాహారానంతరము భరతశాస్త్రపు భంగిమలు వెలయించుట వీరి యుద్యోగము. ఇంతే గాక ఇంద్రుఁడు మొదలగువారు కోరినపుడు వారి రాణివాసములు పిలిపించినపుడు యీ నాగవాసములు పోయి "పాటకచ్చేరీలు" నేసి వత్తురఁట. ఇఁక వీరి దినవెచ్చములు భరించు సాహసి కారు లెవరు? ఉపాయకుశలురగు దేవతల కీమాత్రము దెలియకపోవునా? హయమేధములు, రాజసూయములు మొదలగు సవనతంత్రముల నినాము లుంచినారు. అవి పరంపరగ వచ్చు హక్కులు. ఉపకారస్మరణము మఱువలేని యచ్చరలు, యజ్ఞయాగాదులు చేసిన శ్రోత్రియులు కాలాంతరమునఁ దమ భూములకు వెళ్ళినపుడు శక్తికొలఁది నతిథి సత్కారములు చేయు టాచారము.

స్వర్గలోకపు రాజకీయములందును వీరికి సంబంధము లేకపోలేదు. ఇంద్రునిస్థానము "పర్మనెంటు" కాదు. నూఱు యజ్ఞము లాచరించిన వాఁడంతయు దానికై యత్నింప వచ్చును. ఈ పేరాసగల ఋషులొకొక్కొకసారి తొంబది తొమ్మిది యజ్ఞములను పట్టుదలతో ముగింతురు. అంతవఱ కింద్రుఁడు గూడ యుపేక్షతోడనో లేక సరిగఁ బ్రయత్నింపకయో యుండును. నూఱవయజ్ఞము గళబద్ధమే గదా? అప్పుడీపేరు మ్రోసిన నాయకురాండ్రు ఆటపాటలతో వారిని వలపించి ప్రయత్నమును మఱపించి యింద్రుని యాసన స్థైర్యమును నిలుపుదురఁట. వజ్రాయుధము మొక్కపోయినపుడు—(సాధారణముగ నింద్రుని కట్టివే యెక్కువ లెండు) సురేంద్రుఁడీ—యాయుధముల నుపయోగించి శత్రువుల సాధించును. కాంతల కడగంటిచూపునకు లొంగని మగవాఁ డెవఁ డుండును? అంతే గాదు; "ఖులాసా"గ నున్నపుడింద్రుఁడుగూడ వీరిపై వలపు గలిగి కనుఁగిలుపుట వాడుక. శచీదేవి యెన్నిసాఁపలు మూతి ముడిచెనో పాపము? వీరిని స్వీకరించుటలో నేమియుఁ దరతమభావము లేదు. స్వర్గమునందు కాలిడినవారి కందఱికి నప్సరసలపై నధికార మున్నది. అది నిజముగఁ దకరారు లేని పని గదా!

ఈ వంశములు నాటివి నేటివిగాదు సుఁడీ! వేదకాలము నుండి యుండనే యున్నవి. మన పురాణములలో సాధా

రణముగ రంభాదులు కానేఁగట్టని గాథ లే యరుదు. ఎంత చిన్న రాజసభలోనైన నొక్క రంభగాని హాజరై గజ్జె గదలించవలసినదే! లేకున్న మన కవులకుఁ గడుపే నిండదు. ఏచోట యుద్ధములు జరిగినను సైన్యములతోఁబాటు వీరును రావలెను. పాపము! కాచిన కల్పవృక్షముల పూలన్నియు యోధుల హారములకే ఖర్చయిన నిఁక యచ్చరలకో? ఆ విచారము మనవారి కంతగాఁ బట్టలేదు కాఁబోలు! దేవతలకు, దేవతాసార్వభౌమునికి వీ రెంత మర్యాదగఁ జూడదగిన వారైనను మన కావ్యవీథులలో మాత్రము చింతపండుకన్న నగ్గువయైనారు.

పైఁ జెప్పిన పదునాలుగు వంశములలో నెన్నియో తరములు గడచినవి. మనకు మిగిలినవి ముఖ్యములగు కొన్ని పేరులే. ఈనాఁ డెంద ఉన్నారో మన మెఱుఁగము. ప్రబంధకవులు పోయిననాఁటనుండి ఆ జనాభాలు సరిగా తెలియుటలేదు. అది యట్లుండె.

వరూథిని యొక యచ్చర; ముద్దరాలు. గుటకఁ గడవఁ బెరిగిన గరగరని నెఱికురులు; తిమురుగొన్న పయోధరములు, సెలవివారు నవ్వులతోఁ జిన్నివెన్నెలలు గాయు మొగము, మంకెనపూవువంటి వాతెఱ యామె బ్రహ్మ నడిగి సంపాదించిన వరములు. పైన నావిడ "తిన్నని మేను" నిగనిగని చాయలతో "కాంచనకేతకీకుసుమము"

వలె నుండెనఁట. సౌందర్యముతోఁ దకతకలాడు నామె బాహ్యస్వరూపము, మానసికప్రవృత్తికిఁ బ్రబలమగు పరిణతిని గలిగించినది.

ఈ నిత్య సువాసిని తలిదండ్రుల పేరు చెప్పలేదు పెద్దన్న. తల్లివిషయ మెట్లున్నను తండ్రిమాట కొంత చిక్కే గదా! అందుకే యాసమస్య మెల్లగ జారవిడిచి పాల సముద్రమునఁ బుట్టిన వంశ మని డొంకతిరుగుడుమాటతోఁ దృప్తిఁబడినాఁడు. ఆ విచార మతనికే యక్కఱలేనిది మనకు మాత్ర మేమి? ఎవరో యొక రుండు రని శాంతింతము.

వరూధిని నివాసము హిమాలయమునందు. ఒక వరూధినియే గాదు; రంభ మొదలగు "కామశాస్త్రో పాధ్యాయిను" లందఱు అక్కడనే వసించునది. తక్కినవారికి గృహము లుండెనో లేదో! ఉన్న నవి యెట్టివో మనకుఁ దెలియదు. మన నాయికకు మాత్రము చక్కని భవనమును గట్టినాఁడు పెద్దన. దానికి ముందావరణము నందున్న ద్రాక్ష పందిరియే గరుడపచ్చలు చెక్కినదఁట. ఇంటి చుట్టును జెంగలువలతో నిండియున్న కేదారములు, మావులక్రోవులు, అల్లిబిల్లిఁ గొన్న కాంతారము, హిమవంతమే తయారుసేసి యిచ్చినది. ఇఁక నామె వయసు మాట గదా? పొటమరించిన జవ్వన మింకను పూర్తిగఁ బక్వతకు రాలేదు. "ఎకసెక్కెము లాడు యెలప్రాయమే" నయ-నాణెములు గుఱుతించినది.

వినయవిధేయత లలవరించుకొన్నది. వీని నడుమ నప్పుడప్పుడు చిన్న తనపు చెరలాటము నే నున్నా ననుచున్నది. చాతుర్యమును, పాండిత్యమును, అనుభవమును గల యచ్చరల సాహాయ్య మపేక్షింపక, నైజగతితోడనే తరిబీతై వారి నందఱినిగూడ వెనుక వేసినది. రంభాదులకును మనసులో భయము కద్దు. ఎన్నఁడో జవ్వన మ్ముకొన్న వారు గదా! మెల్లమెల్లగ నేత్రమును బాటించినారు. కడకుఁ బాపము, ప్రాణసఖులును నైనారు. ముసలి ముదిపెముల-తోఁ దీరిక గ్రైనప్పుడెల్ల వరూధిని చుట్టును జేరి "నీకేమి, యదృష్ట వంతురాలి"వని యిచ్చకము లాడుచుండిరేమో! లేకున్న గ్రాసవాసములకు ముప్పే. ఇప్పటికే యింద్రుని సభలకుఁ బిలుపువచ్చు మేళములలో వరూధినికే యగ్రతాంబూలము. ఇఁక మేనకాదుల ప్రాతనాట్యములకై మొగమువాచిన మగవాఁ డెవఁ డుండును?

వరూధిని తోడివా రందఱు సంగీతము నేర్చినవారే. చెలువ మెఱిఁగినసాని వారింటి కంటి వచ్చిన విద్య గదా! అయినను, వారికిని వరూధినికి నొకభేదము మాత్రము గలదు. వృత్తికై కళను సాధించినారు వారు. ఉత్సవసమయములలో దర్బారునకు వెళ్లుటకు మునుపు దుమ్ముదులిపి నాలుగుసారులు తంత్రులు మీటి కార్యమాయె ననిపించుట వారిపని. మన వరూధినీవ్యాసంగ మందమా! అది బ్రతుకునకే యేర్పడినది

కాదు ; స్వీయానందమునే, పరమగమ్యముగ నుంచుకొని, నేర్చుకొన్నది. భౌతిక మగు ఫలాపేక్షయుఁ బరాపేక్షయు లేకుండుటచే గళ పరాకాష్ఠ నందెనది. రాగమునఁ బ్రాణము గల పట్టులు వెదకి "యింపు దళు కొత్త" వీణె వాయింపఁ గలదు. ఆ తంత్రీధ్వనియందు మిళితమై పిల్లగాలివలె నిలు కడతో వెడలునామె గానమునకు రాలు గరగిపారెడివఁట. ఉత్త వ్యాసంగమేనా? కాదు; పాండిత్యమును గడించుకొన్నది. మెడపట్ల పాండిత్యము మాత్రము గాక రసస్వరూప మెఱిఁగి, రసానుభూతికై యత్నించి సంపూర్ణముగ ననుభవించినది. ఆయింత చాపల్యము లేకయున్నచోఁ బ్రపంచమంతయుఁ జేతులు జోడించియే యుండును! పైఁజెప్పినవారిలో నొకరును గిరికవలె "పటుశాస్త్రశ్రేణికాభ్యాసము" చేయనే లేదు.

మొదటనే స్త్రీహృదయము; అందున నాయువుపట్టులు వెదకి, యుపాసించు సంగీతపు సహవాసము. వీనితో నామె మనసు వెన్నవలె నయినది. నిజముగ విచారించినచో సంగీతము కళల కెల్ల రాణివంటిది. చిత్రమునందు వస్తువుయొక్క చంచల ప్రవృత్తులు క్షణికములగు భావములు వరుసగ స్ఫురింపని కొఱఁతయున్నది. కవిత్వమున నీరెండును బాగుగఁ జూప వచ్చును. కాన కవిత్వ ముత్తమ మని విమర్శకు లన్నారు. ఇది

సత్యమే. కాని కవిత్వమునకన్న నెన్నో రెట్లధికమగు, భావగభీరత సంగీతమునం దిమిడియున్నది. దానియందున్న వివిధభావ సమావేశమును గభీరమగు భావశబలతను, గ్రహించుటకు మనసు గావలె నంతే. ఒక మహానుభావులు సంగీతము కేవలము శ్రవణానందదాయకమే నన్నారు. సరస కవిత్వము మాత్రము సర్వాంగములకును "గుత్తుకబండి" యగు నానందము నిచ్చునట. కవిత్వము నెవరైనను గన్నులతో విందురేమో నాకుం దెలియదు. బ్రహ్మ మన యభాగ్యవశమున యే పాముల జాతికో తప్ప యీ యర్థశాస్త్రనియమమును, మనయందుం బాటించలేదు. ఇట్టి విపరీతములగు తలంపులకుం జోటిచ్చుట దాని యస్పష్టతలో నున్నదోషమే.

కళామాత్రమునకే శాంతి పరమసాధన మనుచుండ సర్వోత్తమ మగు సంగీతమున కడుగవలెనా? శాంతి యనగం జచ్చు పెద్దమ్మవలె మూలకూర్చుండి మూలుగుటం గాదు. గంతులతో, గార్యము జరుగ దని యెఱింగి ప్రసన్నతతో సాధించుటయే దాని పరమగమ్యము. భగవంతుండగు రాజశేఖరుం డన్నట్లు సమాధి యన నిలుకడ, శాంతిపర్యాయము గావచ్చును. "తిద్ది తీర్చుటయే" పరమావధి కాదు. మఱి సర్వగుణములతో సమగ్రముగ సాధించుట. ఈక్రింది రాజశేఖరుని పలుకులు చూడుండు: "కావ్యకర్మణి పరం హేతు స్సమాధి సమాధిర్నామ మనస ఏకాగ్రతా".

బీభత్సము మొదలగునట్టిములయందును సౌందర్యము లేకపోలేదు. సౌందర్యము లేని వస్తువు కళానుభూతికి నానంద మునకుఁ బరికరమే గాలేదు. సాధకుఁ డెన్నిపాటులు పడినను కడకుఁ బొందఁదగు - పొందెడు పరమావధి యియ్యదియే. తీక్ష్ణదృష్టియు మననయు మొదలు కొలఁది విషయకర్కశత, గభీరతయుఁ గూడుకట పరమసత్యము. మన ప్రాచీను లీ రెంటి తత్త్వముల బాగుగ నెఱింగినవారు. విషయమునకే ప్రధానత, గభీరత, యున్నచోట ఋషిత్వ మనిరి. సత్యము నానుషంగికముగా సౌందర్యమును ముఖ్యముగా సేవించువారి నే కవు లనిరి. మొదటితరగతి కుపనిషత్తులను జూపి, రెండవశాఖకు రామాయణాది కావ్యప్రపంచముల నేరుకొనిరి.

అపునుగాని యీ విరుద్ధపరిస్థితుల కర్థ మేమి? నాకుఁ దోఁచిన దొకటి-భౌతికములగు వాసనలు వీడనివానికి సౌందర్య పక్షపాతిత్వము మఱువరానిది. అడ్డరానిది. అతని ప్రవృత్తి నివృత్తు లారీత నెందుకు మారినవి? యనుప్రశ్న యనుభవము చాలని దుడుకుతనము. ఒక కళకుఁదోడు మఱియొకటి భౌతిక ముతో, నింకను గొంత సమీపసంబంధముగలది యొనఁగూడెనా యింక నడుగ నక్కఱయే లేదు.

కాఁగా వరూధిని చిననాఁటనుండియు సంగీతమే గాక కామశాస్త్రాభ్యాసములనుగూడఁ గావించినది. దానియందునుఁ జెదరని యాత్మశక్తియే యున్నచోఁ బారమార్థికతనే సాధింప

వచ్చును. కాని వరూధిని లేఁతమనసంతటి కర్కశవిచారములకుఁ దావులేదు, ప్రయత్నింపను లేదు. నైజముగ మనసువోవు పద్ధతిసిఁ బోవనిచ్చుటయే కాని యరికట్టి నిగ్రహించు టామె యెఱుఁగదు, తనకన్నుల యెదుటఁ గనుపించు సౌందర్యమును జూచి యానందించి దానిశక్తికి లోఁగుటయే యామె నేర్చినది. చూచినమాత్రమే సంతోషించు నుత్తమసిద్ధాంతమును గూడ నామె యాచరణయం దుంచలేదు. దాని ననుభవించి తృప్తిపడ వలె నను సామాన్యదృష్టియు నందులో దాగియున్నది. మన మామెనుండి యంతగొప్ప సిద్ధాంతము నభిలషించుట నాకుఁ జూడ వెఱ్ఱియే. ముంచికొనివచ్చు తొలిప్రాయమున తాను నివసించు సౌందర్యసీమలో, ఆ సంఘములో, నట్టి మనఃపరిణతి కవకాశమే లేదు. ప్రతిజీవిపైన నంతయో యింతయో యధికారము నెరపుట పరిసరముల స్వభావము గదా!

సౌందర్యమును భావించుటయం దామెకు సంపూర్ణమగు నధికార మున్నది. అనుభవముచేఁ దొలిచూపునందే హెచ్చు తగ్గులు మంచిచెడ్డలుఁ నేర్పరించు పదునుగల దృష్టిని సంపాదించుకొన్నది. నిరంతరము సౌందర్యమో యని వేకారినది. మంచుఁగురియు ప్రదేశములలో రాత్రింబవళ్లు ఊపిరి బిగించి తీరనిపూనికతోఁ దపము సాధించు తరుణ తాపసులను గాంచి "అయ్యో! యెలఁప్రాయమే! ఉప

భోగార్హమగు దీనిని వైదికకృత్యములలో నలిపివేయు చున్నారే! కడుపునిండ నారగించి కంటినిండ నిద్రింపరాదా! సుఖముగ భోగింపరాదా! సౌఖ్యములపై నింత పగ యెందుల" కని కరుణావిలులితయై కంటఁ దడి పెట్టుచున్నది. ప్రవరుఁ డెదురుపడినప్పుడును "పాపము! బ్రాహ్మణుఁడే! ఆకలిదప్పుల గతియేమో?" యని పనవుటకు ముందే "కుందనము వంటి మేను మధ్యందినాతపోష్మగతిఁ గందెనే" యనియే కుందు చున్నది.

కొంతవఱకుఁ గళయొక్క పరమార్థమును దఱచి పక్వమగు హృదయము గలది గనుకనే యెంతకన్నను తెగింప లేదు. "పూతపసిఁడివంటి వలపుం దులకించు" సానికులమునఁ బుట్టినను "పవిత్రత" యను ధర్మము కొద్దియో గొప్పో యుండనే యున్నది. నయ-నాణెముల నెఱిఁగినను విస్తార ములు నేర్వలేదు. శకుంతల కన్నను నొక్కయా కెక్కువ చదివినది. 'జూలియట్టు' వంటి నిగ్రహమును సమకూర్చు కొన్నది; ఒకరాయి యెక్కువన్నను పొరపాటుగాదు. కలభాషిణి వంటి జాణ గాదు. మహాకవి "మిరాండా" వంటి చక్కిలిగింతయైన నెఱుఁగని జేల గాదు. అన్నిరీతులఁ జక్కనిదే. కాని యాపువ్వునకు తొడిమయందే తెవులున్నది. తనకులము, తనమనసు, తనవలపు పరస్పరవిరుద్ధములగు సన్నివేశములలో నుండుటచే జీవితకావ్యము రక్తిగట్టలేదు.

ఇక నామె దైనికజీవితమును గురించి విచారింతము. వరూధినియొక్క దినచర్యను స్పష్టముగా విప్పి చెప్పలేదు పెద్దన్న. అయినను వర్ణనాసన్నివేశములఁబట్టి మనకు సాధ్యమయినంత యూహింతము. తెల్లవారుట తోడనే యాకాశగంగయొక్క నీటితుంపురులచేఁ జల్లగ స్వాగత మొసఁగు మారుతములలో రమణీయముగఁ బ్రోదిగొన్న కాంతారములయందు 'షికారు' వెళ్ళుట మొదటి పని. వన విహారములు ముగిసిన తరువాత చెలులును దానును జలకేళీ లాలసలై సరస్సులయం దోలలాడుదురు. స్నానాంతర మందఱును దమతమ యిండ్లకుఁ బోవుదురు గదా! అప్పటి నుండియు వరూధినికిఁ కళాభ్యాసమే. కాలము మాఱి నట్లంతయు తంత్రులను భిన్నభిన్న గతులతో మేళవించి తత్తదనుకూలములగు రాగముల నాలపించుచుండెడిది. హిమ శైలమునందు వేసరిక గలిగినపుడు మేరుపర్వతములోని కల్పవృక్షముల నీడల క్రింద రచ్చపట్టులలో నందఱు కొలువై, విశేషముల ముచ్చటించుకొనుట వాడుక.

వరూధిని సానివాడలోఁ బెరిగిన పడుచైనను తక్కిన వారివలె వలపుఁబట్టినయెడ వచ్చినవానితో విహరించి సాగనంపునది గాదని ముందే విన్నవించితిని గదా! వయస్సా సవోద్భిన్నము; కాపురమున్నది ప్రకృతి సౌందర్యము తూగియాడు హిమగిరిప్రాంతము. భోగములా! హాయి!

హాయి ! మనసునకుఁగూడ నూహించుకొనరానివి. ఆమె వాడు సామానులు సంపూర్ణముగ మనకుఁ దెలియవు గాని యనులేపనద్రవ్యములుమాత్రము వివరించినాఁడు; చూడుఁడు.

సీ. "సద్యోవినిర్భిన్న సారంగనాభికా
వ్యాప్తమై పిసాళించు మృగమదంబు
కసటువో బీరెండఁగరగి కత్తిల నంటి
గమగమ వలచు చొక్కపు జవాది
పొరలెత్తి ఘనసార తరువుల తను దాన
దొరగిన పచ్చకప్పురపు సిరము
గొజ్జంగి పూటొదల్గురియంగ పటికంపు
దొనల నిండినయట్టి తుహిన జలము."

(౨-౫౪)

ఎవరి కున్న దీ భోగము ? ఇట్టి యపరూపమగు జీవితమును భావోద్వేజకతకుఁ బ్రోదిగూర్చు సన్నివేశములును గలిగి యామె చెడక నిల్చునది గదా ! ఎందులకు ? స్వర్గమున నెవరును మేలురకపు విటులు లేరా? "జయంత వసంత కంతులు" నిరంతరము సందెవేళల సానివీథులఁ దిరుగుచుండు వారే! మేలేర్చి కోరుకొనరాదా యొకరిని? ఇంద్రసభలకు నాట్యములకై వెళ్లినపు డెంతమంది కొంగు బాకునకై యాసించి యుండరు ? మనవంటి కుటుంభకులకుఁ దీరిక లేదు. కాని అమృతపానమునఁ జియ్యబట్టి తీరికెగఁ గూర్చున్న వారికేమి? నిరంతర మీ విచారములే గదా ! ఆసలింద్రునికే

కన్నుగీటినచో నా సహస్రనేత్రములు సంపాదించుకొన్న రసికాగ్రణికి మాత్రము చాపల్యము తక్కువా? దైవ యోగమున వశుఁడైనచోఁ దనయదృష్టమునకు మితియే లేదు గదా? ఇవి సామాన్యులగువారి యాశలు. వరూథినివంటి కళామూర్తి కివి నచ్చునా? ఆమె 'యలేఖ్యతనూవిలాసుని' వలచినది. "ఉదుటుచూపులు గల దేవవిటుఁడు నచ్చఁడా వధుపుకు." మఱి "తారుణ్యమౌగ్ధ్యములు" గల చిక్కని వరుఁడు గావలెను. ఆమెది యాదర్శములేని యదనపు బ్రతుకు గాదు. కళామర్మములు క్రొత్తగా వల్లెవేసినది. తన పచ్చిపాండిత్యమును వెల్లడించు కోరిక యున్నది. దానికై యెదురుచూచుచున్నది. ఆమనోరథము యౌవనకృత మగు మాంద్యమును గూడ మఱపించునంత తీవ్రమై యుండినది. మునుపు స్వచ్ఛందవృత్తి గల విలాసరసికుఁ డగు గంధర్వుఁ డామెను గామించినాఁడట! తన విదగ్ధతను జూచి వరూథిని తప్పక ప్రేమించు నని గంపెఁ డాసతో వచ్చినాఁడు. కాని యామె చలించలేదు. వారిరువురికి సంబంధము-మనసులు మాత్రలేదు. రూప గర్వితుఁడగువాఁడు చిక్కుమొగముతో వెనుకకు సాగినాఁడు. అందచందములతోఁబాటు నత్యంత రమణీయముగ గుణసౌరభములు వాసించు ముద్దరాలు. ఆత్మశక్తి లే దనరాదు; అపరిణతము. దానికిఁ గళయే కారణము. ఆమె సర్వవిధముల సమ్మానింపఁ దగినదే కాని జీవితమునఁ దోకచుక్క పుట్టినది.

మనుచరిత్రమున నీకథకుఁ బ్రాధాన్యము లేదు. రెండా శ్వాసములే వరూథినియొక్క వృత్తాంతమునుఁ గూడినవి. చాల మంది పండితులు పితామహుని కీదోష మంటఁగట్టిరియే యున్నారు. "ఇది పురాణము గాదు, కావ్యము; వరూథినీ జీవితము కడపటివఱ కనువర్తింపనిచో, నైక్యము చెడును." పూర్వపక్షము సరియే గాని యీ గ్రంథమున నాదోష మంత పెద్దదియై యుద్వేగమును గలిగింప దని నామనవి. కొలతబద్దలతోఁ గావ్యములఁ గొలుచు బుద్ధిమంతులకుఁ జెప్పలేము గాని యుభయ మెఱిఁగిన రసజ్ఞులకుఁ దోఁచు భావ మింతే. లక్షణ కారులును తూ-చా-తప్పక, నియమములఁ బాటించియే తీరవలె వలె నని ముద్ర వేయ లేదు. భగవంతుఁ డగు రాజశేఖరుఁడు "లక్ష్యైకతోపాః పండితంమన్యాః" అని సెలవిచ్చినాఁడు. ఈ కథగూడ స్వరోచి జన్మవృత్తాంతమును దెలుపుటకు వచ్చినది. స్వరోచిజన్మాంతరమే ప్రారంభింపఁగూడదా యన్నచో నపు డింతకంటె చిక్కు. కవి గ్రంథమునకన్న పాఠకుఁ డూహింప వలసిన దెక్కువగా నుండును. వసుచరిత్రము, శృంగారనైష ధము మొదలగువానికథ వేఱు. దీనికిఁ దక్కినగ్రంథములకును గవిదృష్టియందును ఫలమునందును గూడ బ్రహ్మాండమంత భేద మున్నది. ఆ యుపాఖ్యానమే కావ్యయోగ్యము గాదన్నచో నట్టివారికి మనము చెప్పవలసినదియే లేదు. దోషలేశ మున్న

దానినెల్ల విడుచుచుఁ బోయినఁ గడకు మనకు మిగులునది పూర్ణానుస్వారమే. అట్టి మడిగట్టుకొన్న మహానుభావులు దోష భూయిష్ఠమగు నీ ప్రపంచమునుండి సెలవు తీసికొనుట తంటా లేని పని.

పారిజాతాపహరణమునందువలె ప్రథమాశ్వాసముననే వరూధినిని బ్రవేశపెట్టుటకు వీలులేదు. దానిలోఁ బ్రవరుని సాంసారికపరిస్థితులు దైనికజీవితమును దెలుపకున్నచోఁ నాతని ధర్మనైష్ఠికత మనకు బాగుగ బోధపడదు. పెద్దన సిద్ధాగమన మును బెంచలేదు. విప్రుని ధర్మనైష్ఠికతను, సూచించు నంగ ముగ నది సంకుచితముగాక విస్తృతముగాక, మట్టసముగ నున్నది. కనుక మనము ప్రథమాశ్వాసముననే ప్రవేశపెట్టి యుండిన దృశ్యకావ్యముల తీరును సాధించియుండునే యని నిట్టూర్చిన లాభము లేదు. ప్రవేశించినది ప్రవరుఁడు గదా! మొదటనే శృంగారపు త్రోవఁ బట్టించిన బెదరు నని కాఁబోలు, తొలుత భగీరథుని తపోవనము, గంగావతరణస్థలము, తదు వాత లోకమాతయగు భవానీదేవి యాపసోపములు సూపి క్రమముగ 'గ్రేడు' దించినాఁడు. ప్రవరునిచేఁ దనివి దీఱఁ బొగ డించి చూచినదాన ధన్యుఁడనైతి ననిపించినాఁడు. ఆపందడిలో పాదలేపము గరగించి పైకిఁ బడ మన్నాఁడు. వరూధినియొక్క రంగస్థలమున జవనికా నిర్దేశ మెంత హాయిగ నున్నదో సహృదయుల తలఁపు దాఁకక పోదు. చిన్నగఁ జూతము రండు:

సీ. కులిశధారాహాలి కొలుపునఁ బైనుండి
యడుగు మోవఁగఁ జేగురైన తటుల,
గనుపట్టులోయ గంగా నిర్ఝరము వారఁ
జలువయౌ నద్యేటి కెలఁకులందు
నిసుకవెట్టిననేల నెదిగి యర్కాంశులఁ
జొరనీక దట్టమై యురులు గవియుఁ
గ్రముకపున్నాగ నారంగరంభానాళి
కేరాదివిటపికాంతారవీథి

గీ. గెఱలు పికశారికాకీరకేకిభృంగ
సారసధ్వని దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్దమీన గంధర్వయక్ష
గానఘూర్ణితమగు నొక్క కోనఁగనియె.

సందర్భమున కనుకూల మగు భంగి రమ్యముగఁ జిత్రించి నాఁడు. సర్వసంపూర్ణ మగు సౌందర్యముతో వస్తువు కన్నుల యెదుట గోచరించుచున్నది, మొదటిపాదమున నుపమానమును కనఁ గలిగి చూచినచో సౌందర్యపిపాస యందు దానిని గడముట్టఁ బాఠకుని కందించు పరిశ్రమయం దతనియాశ యెంతటిదో తెలియరాఁగలదు. నన్నయ ప్రారంభించిన బాహ్యవర్ణన సోమునితో వెక్కసమై తిక్కనతో మట్టసముగఁ గళామర్మములు నేర్చి శ్రీనాథునియందు దూఁగి, పితామహునియందు చల్లగఁ బండినది. "గంధర్వయక్షగానఘూర్ణిత"మని సృష్టించిన చిత్ర

మునకుఁ బ్రాణప్రతిష్ఠఁ గావించినాఁడు. మునియాశ్రమమును భ్రాంతిని గలిగించి యందలి వివిక్తశాంతిని దెలిపి చెదరని లావణ్య మొసఁగినాఁడు.

పురాతనకాలమునుండియు ప్రకృతివర్ణనమున మన కవు లనుసరించిన పద్ధతులు రెండు గలవు. రంగమునఁ బ్రవేశించు పాత్రల యాంతరిక మనఃప్రవృత్తి కనుకూలమగుభంగి పరిసర ముల వర్ణించుట మొదటిది. రెండవది పాత్రల మనస్తత్త్వ మున కనఁగా తత్కాల పరిస్థితికి విరుద్ధముగు వడువున నిర్దేశిం చుట. జాగ్రతగఁ బరీక్షించినచో వేదములనుండియు వీని కుదాహరణము లివ్వవచ్చును. గీర్వాణమున మన మెఱిఁగినంత వఱకు మొదటివాఁడగు భాసునియందు నీ యలవాటు గలదు. ఆతనినుండి కాళిదాసు సంగ్రహించెను. కాళిదాసు సాధారణ ముగ మొదటిమార్గమునే యనుసరించుట వాడుక. అతఁ డనుసరించినాఁ డన్నచో వాఙ్మయమున నామార్గమే విరివి యనుట చెప్పకయే చెప్పిన ట్లగును. వాల్మీకి పంపావర్ణనమున రెండవదారినే ద్రొక్కెను. వ్యాసవాఙ్మయమున నీవిధ మెక్కుడు. భవభూతి వ్యాసభగవానుని మార్గములోనివాఁ డనుటకు సంశయమే లేదు.

రెంటియందును సాధక బాధకములు వీడరానివి. పాత్రల పరిస్థితి కనుకూలములగు పరిసరములు, పరికరములు

గలచోట సామాజికులు త్వరితముగ లయింతురు. అప్పుడు కవిపనియు సుఖకరము; మెప్పును సులభము. రెండవపద్ధతి నీటి కెదురెక్కుట వంటిది. ప్రకృతియందుగల విరుద్ధ పరిస్థితులలోఁ బాత్ర ప్రవేశించినప్పుడు రెంటినడుమఁ గల వైరుధ్యము దానిచేత పరభాగత మనకు స్ఫుటముగ గోచరించును. తత్కాలమున రంగమున నున్న పాత్రలకు సంబంధించిన హృదయవేదన మొదలగు భావములు చక్కఁగ మనసునకుఁ బట్టును. మొదటిమార్గమునందు శాంతియు, రెండవదాన నాకులతయు నీడరానివి. స్థలభేదములను, వ్యక్తి భేదముల ననుసరించి తూచి యుపయోగించినచో రెండును సామాజికుల, లేక పఠితల హృదయముపైఁ దీవ్రముగ పని చేయఁగలవు. మన వాఙ్మయమునను, కొంతవఱకు గీర్వాణమునను నీరెంటి నుపయోగించుటయందు దోర్వరాని యవకతవకలు లేకపోలేదు. అల్లసాని పెద్దన కాళిదా సనుసరించిన తోలుతటిరీతి నిందుపక్రమముగఁ దూచి యుపయోగించినాఁడు. ఆ వస్తుసౌందర్యము ప్రసరునేగాక ప్రపంచము నంతయుఁ గట్టివేయఁ జాలియున్నది.

జవనికానిర్దేశమైన తరువాత నారంగమున నాడఁదగు వస్తువులఁ జూపుచున్నాఁడు. మణిమయమగు నంగణము, తరుణసహకారము, దానినీడయం దొక వితర్దిక, శీతలానిలము మొదలగునవి. ఇఁకఁ దిన్నగ వరూథినికై తెర నెత్తినాఁడు.

అల్లన సోకిపోవు మారుతాంశుకములలో వీణియ పెట్టుపైని వ్రేళ్లు గదలించుచుఁ గూర్చున్నది వరూధిని. సమస్తమగు ప్రకృతియు నామె గానబ్రహ్మమున లీనమై యున్నది. అప్పటి వరూధిని పరిస్థితిని కవి యీరీతి వర్ణించినాఁడు.

సీ. తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపు కావిరంగు వలన
శశికాంత మణిపీఠి జాజువారగ కాయ
లుత్తుంగ కుచపాళి నత్తమిల్ల
తరుణాంగుళీ ధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు ఘటింప
నాలాపగతి సోక్కి యరమోడ్పు గనుదోయి
రతి పారవశ్య విభ్రమము దెలుపఁ
గీ. బ్రౌఢి బలికించు గీత ప్రబంధములకు
క్రమకర పంకరుహా రత్నకటక ఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణె వాయింపుచుండి.

(౨-౫౭)

నాకుఁ దెలిసినంతవఱకు తిక్కనను సూరన్నను విడిచి యిట్టి సుకుమారపద్య మింకొకటి భాషలో లేదు. తత నితంబము, ఉత్తుంగకుచపాళి, తరుణాంగుళి యను పదముల యందు నవోద్భిన్నమగు యౌవనము ధ్వనించుచున్నది. "జిలిబిలి" పాటలో యౌవనకృత మగు మాంద్యము ఒయ్యారము నున్నది. ఆలాపమును గావించునపుడు

సాక్షాన యపమాతగనుటం రతిపారవశ్యవిభ్రమమును దెలిపిన
వంటి. భళిరా! అస్థాయిని, ప్రకృతమున కంటె యెంతక,
యెంత సున్నితముగఁ బలికించినాఁడు; ఆ యుపమాన మర్థ
పుష్టిచే మదించి రమణీయ మగు తావి పుక్కిటఁ బట్టిన
యేడాకు లరఁటి బాలెంత రాలివలె నున్నది. "ఇంపుదళుకొత్త"
యనుటలో నామె ఘనసహృదయ మున్నది. ఇచటి "ఘోరార్థి"
యనుపదమునకు రసోన్ముఖత యని వ్యాఖ్యానమేమో?
తత్కాల మనఃప్రవృత్తి కనుగుణముగ బాహ్యస్వరూపమును
చిత్రించిన పెద్దన, తిక్కనకెంతటి పగ్గరిశిష్యుఁడో మనము
గ్రహింపవచ్చును. అయిన నొక కొఱఁతఁ గలదు. మొదటి
పాదములోని తీక్ష్ణదృష్టి రెండవపాన లేదు. అది కేవలము
పూరణార్థ మతికించి నట్లున్నది. నాలుగవపాదములోని
రసాభివ్యంజకత దేనికిని లేదు. భావమును క్రమక్రమముగఁ
బెంచుకొనిపోవు పద్ధతియం దేలనో కొంచెముగఁ బొరవడి
నాఁడు పెద్దన. ధ్వనికారుఁడు "వాచ్యవాచకలక్షణమాత్ర
కృతశ్రమాణాం కావ్యతత్త్వార్థభావనావిముఖానాం స్వర
శ్రుత్యాదిలక్షణ మివ ప్రగీతానాం గాంధర్వలక్షణవిదామ
గోచర ఏవాఽసౌ శబ్దః" అన్ననిజము నూహించికాఁబోలు
ధ్వనిమూఢులగు ఛాందసులకై తా నన్నదాని కీ గతి
వ్యాఖ్యానముఁ గల్పించినాఁడు.

"వివిధ విబుధతరుజనిత మధురమధు రసంబా ను

నడటునన్, జడిమిన నెఱుంగక మదన హాసనైన జదురనన్ గడియ గమకించు తిమురనన్ గొమిరెప్రాయంపు మదంబున ననన్యసామాన్య లావణ్య రేఖామదంబునను."

పై పద్యమున ధ్వనిగ గోచరించిన యౌవన మిందు వాచ్యముగ స్పష్టముగ నున్నది.

అందఱికన్నను పెద్దనయందు వృత్తవిన్యాసము గొప్ప ప్రతిభ. ఏసందర్భమున నేపద్యమును వాడిన వృత్త నియమమునఁ గుదిరిన పదములు శ్రవణ మాత్రముననే సౌందర్యము నింపు నని చక్కఁగ గుఱితించినవాఁడు. మచ్చునకు రెండుమాత్రము గానుపింతును.

శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కే
దారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాం
తారంబునం దైంపవ
గ్రావాకల్పిత కాయమాన జటిల
ద్రాక్షా గుళుచ్ఛంబులన్
పూవున్ దీవెల నొప్పు నొక్క భవనం
బున్ గారుడోత్కీర్ణమున్.

పై పద్యము రెండవయాశ్వాసములోనిది. ప్రవరుఁడు వరూధినియొక్క భవనమును జూచిన సందర్భమున నున్నది. శార్దూలమున నన్నివృత్తములకన్నను గురువు లెక్కువ. బాగుగఁ జేతులు చాచి చెప్పుటకు పనికివచ్చు పద్ధతి దాని

పుట్టుకలో నేగలదు. ఇట్టి యీపద్యముచే వరూధినియొక్క భవన వైశాల్యము మొదలగునవి రేఖామాత్రములుగ సూచితము లని చెప్పినచో నవ్వ నసుకొందును. పైగా నను ప్రాసములచే బిగింపఁబడి, కాసెగట్టి నాట్యమునకు నిలిచిన యొయ్యారివలె నున్నది. అనుప్రాసములు బలవంతముగఁ గాక నైజగతితోఁ బ్రవహించిన వగుటచే విచిత్ర సుందరములుగ నున్నవి. అదిగో పై పద్యమునందే నాట్యము.

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపలుకు వెలుపు నొక్కమారుత మొలసెన్.

ఈ పద్యముయొక్క గురులఘు స్వరూపములలో నొక సమగ్రమైన స్పష్టమగు లయ పాటింపఁబడినది. కడపటిపాదము ముక్తాయింపిచ్చి ముగించుచున్నది. మఱల పల్లవి నెత్తినాడు కథకు దిగి.

వృత్తవిన్యాసమున భావ మున్నదనుట పిచ్చియందు రేమో! ఈవిషయమున నాకన్న పిచ్చివారు మహనీయులగు విశ్వనాథసత్యనారాయణగారు. వా రింతకుమును పోకచోట మనుచరిత్రకారుని వృత్తవిన్యాసమును మాత్రమే గుఱించి విపులముగఁ జర్చించియున్నారు. మా యిరువురికన్న తే మేం

ద్రుఁడు మొదటి పిచ్చివాఁడు. ఆతఁడు ప్రతియొక వృత్తమును విషయవిభాగముతోఁ గూడ నిర్ణయించి యున్నాఁడు.

ఇఁక ప్రవరునిసంగతి విచారింతము. పర్వతభూము లన్నియుఁ బ్రసిద్ధములైనవి దిలకించినాఁడు. నెత్తిపై ప్రొద్దు. ఎండలు తీవ్రములైనవి. ఆఁకలి ప్రొద్దయినది గాఁబోలు, మెల్లగ మన సింటిదారి కీడ్చినది. ఎగురఁబోయినాఁడు. కాని పాద లేప మేదీ? ఎన్నఁడో యాఱిపోయినది. ముట్టిచూచినాఁడు; తడిగూడ లేదు. "గిరికటకగుహావిహారమతి" యగు విప్రుని కున్న యుత్సాహమంతయు మాయమైనది. పాప మాతనికిపుడు హిమగిరి మాహాత్మ్యములు-శచీదేవియు-నింద్రుఁడు జలకము లాడి నప్పటి యుల్లాసములు స్ఫురించుట లేదు. మఱి "వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్రమే" యని భయపడుచున్నాఁడు. దైవమా! యిచటినుండి బ్రతుకు జీవుఁడా! యని బైటఁబడినఁ జాలు నని దిక్కులు చూచుచున్నాఁడు. పోనీ, ఒకవేళ తాను ఎవరో మఱియొక సిద్ధుని యనుగ్రహముచే నిచటనే సుఖముగ జీవించు ననుకొందము. అపార మగు పుత్రప్రేమతోఁ గరగిపోవు "దేవియుం దేవరవోలు" ముసలి తలిదండ్రుల గతి? తోడు నీడలై వెన్నంటి క్రీడించుచుండు సచ్ఛాత్రుల యవస్థ? వీని కన్నిటికన్న ముఖ్యములగు నిత్యకృత్యములు? చింతాసాగర మునఁ బడినాఁడు. ఆకులత చేఁ గమలిన మొగముతో, నెవఁడురా

న న్నీకష్టమునుండి గట్టెక్కించు మహాపురుషుఁ డని యూ "మిన్నులు వడ్డచోట" వెదకుచు వచ్చుచున్నాఁడు.

హఠాత్తుగ నాతని కీకోన కంటఁబడినది. అలతియలతి నులివులతోఁ బ్రక్కన నొక సెలయేరు మలకలై దిగుచున్నది. దాని కిరువైపులను మల్లికలు పూచి పుష్పించియున్నవి. వెంటనే యందలిసాత్త్వికత దానితోఁబాటున్న శాంతి, యతని కర్థమైనది. వేదకు పెన్నిధి దొరకిన దని సంతసించినాఁడు. అచటి కరిగినఁ దనకు మోక్షము గలుగునను తహతహ యెక్కువైనది. "బ్రతుకురా బడజీవుడా!" యని మల్లికల యూతతో ప్రవాహ మున కెదురెక్కి నడచినాఁడు. ఎదుట నొక కేదారము, ద్రాక్ష పందిరి, గరుడపచ్చలచేఁ జెక్కఁబడిన కుడ్యములతో నిగనిగ లాడుచుండు భవనము కంటఁబడినది. వరూథినిగారి కాయింటికై ఖర్చెంతయ్యెనో, యెవరిచ్చిరో! పాపము మనకవులు ధర్మా త్ములు. శర్మగారన్న ట్లింటఁ బెండ్లాము ముక్కరకు ముత్తెము లేకున్నను ముంగిళుల మాత్రము ముత్యాల మ్రుగ్గులు బెట్టుదురఁట. ఎంత సంపన్నగృహస్థుఁ డైనను, ప్రవరుఁడు రాసులు రాసులుగ రత్నముల నెచటను జూచియుండఁడుగదా! ధర్మకాలపువాఁడు గనుక వెంటనే "ఉదంచిత సౌభాగ్యగరిమ కచ్చెరువడినాఁడు." ఇంతలో మృగమదము, ఘనసారము మొద లగు వాసనాద్రవ్యములతో సురభితమగు చల్లనిగాలి యెదురు వచ్చినది. బ్రాహ్మణుఁడు మునియాశ్రమమయి యుండదని-

తీర్థానించుకొన్నాఁడు. ఆశలో నర్ధభాగము తగ్గినది. కాని యెవరో యొక రండక తప్పదు గదా! మన కెవరైన నేమి? వారినే యడిగి యూరిదారి తెలిసికొందమని రంగమునఁ బ్రవేశించినాఁడు; ఎదుట నున్న సౌందర్య సంఫుల్లమగు ప్రకృతి, చల్లనిగాలి, వీణానాదము రతీదేవివలె నున్న "మరున్నారీశిరోరత్నము" నాతని మనస్తత్త్వముపై కొక్కసారిగ గుప్పించి యెగసినవి. హఠాత్తుగ, నకాలమునఁ, గలిగిన యీ విచిత్రసన్నివేశముతో నాతఁడు "విభ్రాంతుఁడై" నిలిచినాఁడు.

ప్రవరునిది రమణీయమును సుకుమారమునగు రూపు, కమలముల వంటి కన్నులు, పీనులతోఁడ రాపాడు భుజములు, విశాలమగు నురము, మృదుపదములు. ఇవి యీతనికి పుట్టుకతోఁ బుట్టిన లక్షణములు. వీని కన్నిటికిని పై పూఁతయగు బ్రహ్మతేజముసు గష్టపడి సంపాదించినాఁడు. అతని లావణ్యమా! నేరేటేటియసలు దెచ్చి నీరజాప్తుని సానబట్టఁగ మిగిలిన రాపొడి గలిపి నీటికి బదు లమృతమునే వాడి యాతని దివ్యసుందర విగ్రహమును దీర్చినాఁడట బ్రహ్మదేవుఁడు. చుంగులుదీర్చి కట్టిన నీరుకావి పంచె, అరుణాంశుకోత్తరీయము, లలాటపట్టికయందు వెండిరేకులవలె, పలపలమని మెఱయు విభూతిపట్టెలు చెవులలో నిగనిగలాడు మణికుండలములు,-(అతఁడు మనవంటి దౌర్భాగ్యుఁడు గాఁడు గదా!) ఆతని యాహార్యకములు.

అచ్చెరమున సద్దము వంటిది. ఏభావమునైనను దాచి యుంచుట, సమయము వచ్చినపుడే వెల్లడించుట మొదలగు "చాకచక్యము" లామె యెఱుఁగనే యెఱుఁగదు. స్త్రీ సహజములగు సిగ్గు, భయము, విభ్రమము మొదలగు భావపరిణామములు గబగబ సినిమాచిత్రములవలె నామె ముఖమునఁ దాండవించును. యౌవనముచేత మొలకెత్తి చిగురించిన చాపల్యము నైజము గాని, యవహిత్థకుఁ జోటీ యదు. ఒక వస్తువును జూచినపుడు లేక యొకదానిని భావించు నపుడు తనకుఁ దోచు తలఁపును, వెలిపుచ్చువఱకు నామెకు నిద్రయే రాదు! రాగతాళముల నడుమ విలీనమై యుండిన యామె మనసు నకస్మాత్తుగ ప్రవరుఁ డాకర్షించినాఁడు. సౌందర్యపరీక్షయం దనితరసాధారణమగు చాతుర్య మామె కున్నది గదా! చూచినవెంటనే యాతనిముఖమునఁ దాండ వించు ముగ్ధత, యంగములలోని మిసిమి, ప్రవర్తనలోని నాశ్చర్యము స్పష్టముగ గ్రహించినది. అట్టివాఁ డీయెడ కెందుకు వచ్చెను? తా నేకాంతమున నున్నయెడ వాని కేమి పని? ఇత్యాదిసందేహము లామెమనసు నిండి తొణకినవి; కనులు విస్తరించినవి; కనీనికల కాంతి గ్రుమ్మరించి తనివిదీర నాతనిఁ జూచినది. గుబ్బచనులు గగుర్పొడిచినవి. మదిని కోరిక లలముకొన్నవి. ఒకటిరెండు నిమేషములు గడచినవి

ఇంతలో నెక్కడనుండియో సిగ్గుదొంతరలు - వరుసగ నాక్రమించినవి. కడియముల ఝణాఝణాలతో బిరబిర నొక పోకచెట్టు మాటున కేగినది. ఆనడచునపుడు తుఱుము, లేనడుము మల్లల నాడినవట. పోయి, యూరకున్నదా! లేదు. అట్లుండుట యాఁడు వారి లక్షణమే గాదు. ఇన్నాళ్ళ తపస్సీనాఁడు ఫలించినదని పొంగిపోవుచు మాటిమాటికిఁ జూచి చూడనట్లు చూచుచున్నది. అప్పటి భావశబలత నీరీతి వర్ణించినాఁడు పెద్దన :

మునుమునుఁ బుట్టెడు కొంకు లౌల్యము నిడన్,
మోదంబు విస్తీర్ణతన్
జొనుపన్, గోర్కులు క్రేళ్లు ద్రిప్ప, మది మె
చ్చుల్ రెప్ప లల్లార్ప, న
త్యనుషంగస్థితి రిచ్చపాటొసఁగ నొ
య్యారంబునన్ జంద్రికల్
దనుకన్ జూచె లతాంగి భూసురుప్రభు
ల్లన్నేత్ర పద్మంబులన్.

కొంకు లౌల్యమును,- మోదము విస్తీర్ణతను-కోర్కులు క్రేళ్లు ద్రిప్పుటను, అనుషంగస్థితి రిచ్చపాటును - మెప్పు రెప్ప లల్లార్పుటను గలిగించుటలో గొప్ప స్వభావ మున్నది. భావమునుఁ బెంచుటలో నొకక్రమము పాటింపఁబడినది. ప్రతిభావమును బైదానికి సహజముగ దారివిడచుచు, వెనుకటి భావము నకు, సౌందర్య మొసఁగుచున్నది. ఒక్కొక్కభావమునందును,

నవాంతరములగు తలఁపుల కవకాశ మొసఁగుట పెద్దనలోని పెద్ద పనితనము.

ఎన్నఁడా పాపమునకుఁబోని ప్రవరుఁడును నామె విభ్ర మము మొదలగువానిని గ్రహించినాఁడు. వివిక్తస్థల మని మొదలే యెఱుఁగును. అది స్వయముగనే చూచుటచే మఱింత స్పష్టమైనది. పురాణపఠన వాసనావశతచే హిమగిరియం దచ్చర లుండి ఋషుల నియమములఁ జెఱచుచుందురని యెఱిఁగి కాబోలు పలుకవలయు తెఱఁగునఁ బలికింపఁ దలఁచి బెదరుచు చావుధై ర్యముఁ దెచ్చుకొని 'యెవ్వతెవే! భీతహరిణేక్షణా! పాపము; తో డెవ్వరు లేరే!' యని దయఁగనబఱచి, భూసురుఁడ నని సహా యపాత్రత్వమును కౌలీనతను సూచించి యాత్మాపరాధము నకుఁ బశ్చాత్తాపపడుచు నడుమ నడుమఁ దిట్టుకొనుచుఁ గర్మను దూఱుచు ప్రారంభించినాఁడు. కడకు "సహాయ మాచరించినచో నీకు శుభమగు" నని గట్టిగఁ జేతులెత్తి యాశీర్వదించినాఁడు. బ్రాహ్మణత్వ మెంత పండి ఫలించినదో యా కడపటి చరణము చెప్పుచునే యున్నది.

వరూథిని యాకాంక్షించునది శుభాశీస్సుగాదు; మఱి ప్రవరునివంటి యందగాని బిగికౌఁగిలి. క్షణక్షణోద్భిన్నమగు నవయౌవనమునఁ దనమనసు నగలించు యొకకోరికకై యిన్ని దినము లాగినది. దైవయోగమున నట్టి యవకాశము

సిద్ధించినపు డౌచిత్యానౌచిత్యముల విచార మెక్కడిది ? వరూధిని యీఘట్టమున నాత్మశక్తి నెంతయో వినియోగించిన దనవచ్చును. ప్రవరునిమాటకు "చనుగవయు నడుము వడకు భంగి" "సెలవివాఱ" నవ్వినదట. వయసు పోతర మున మదించినభావములు వివేకమునకుఁ జోటొసఁగుటలేదు. తూము దెగినట్లున్న దామె రసావేశము. అయిన నెంత నాజూకుగ మాటాడుచున్నదో చూడుఁడు. "ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి" నడిగెద వని చిగురువంటి తన వైదగ్ధ్య మును జూపినది. "భూసురేంద్రా!" యని నవ్వినది. "ఏకాంత మని" సమయానుకూలతను సూచించినది. "వచ్చిన త్రోవ నెఱుఁగవా" యని లేని చాతుర్యము నాతని కంటఁ గట్టి వరుసకు దించినది. "భయములేదా" యని గద్దించినది. "ఎల్లిద మైనామా" యని స్త్రీ సాధారణమగు కసరింతను జల్లినది. పైన వీని యన్నిటియందును స్వభావసౌకుమార్య మను మచ్చు మందు గలిపినది.

ఈ "నర్మగర్భముల" లోని గిలిగింత లాతనికిఁ బట్టలేదు. తన చింతలోఁ దానున్నాఁ "డేమిరా దైవమా" యని! తన మాటలలోని పనితనముపై దృష్టినుంచినటులగాని గ్రహించు నట్లుగాని లేదు. అందుకుఁ దగినచిహ్నము లాతనిముఖముపై నగుపించుటలేదు. చూచినది. వరూధిని తిన్నగ మఱల మఱచినపాట మొదలందుకొన్నది. కారణ మేమి? ప్రవరుఁడు

కర్మనైష్ఠికుఁ డని యాతని వేషమే సాక్ష్య మిచ్చుచున్నది. అతఁడు తన కౌలీనత నేమిఁగా దలఁచెనో! ఆసందేహ మట్టులే యున్నఁ దనపై మొగమోటముఁ జూపఁడేమో! ఇత్యాదు లామెమనసు బాధించుచున్నవి. మెల్లగ మాటలసందులో శ్రీమహావిష్ణువు భార్యయగు లక్ష్మీదేవి తనకు సాక్షాత్తుగఁ దోడఁబుట్టని పెద్దవారితో బాదరాయణసంబంధము గలిగినది. "ననవిల్తు శాస్త్రపుమినుకులా వర్తించు"ట వెన్నతోడఁ బెట్టిన దని సరసతలో నగ్రతాంబూలమునకై చేయిసాచినది. "పద్మ సంభవ వైకుంఠ భర్గసభలు సాము గరిడీ" లని తను "అరె మనె యధికారమును" తెలిపినది. పేరు వరూధిని యని తన "యడ్రస్సు" దెలిపినది. మాటలతోఁ బ్రయోజనము లేదని గాఁబోలు నడుమ లేఁదమలపాకువంటి లలితసమాసము నొకదానిని మచ్చునకుఁ జూపినది. కడకు మర్యాద యెఱిఁగిన పెద్దదానివోలె "మాయింటి విందవై సత్కారమును స్వీకరించి బడలికలు పాసి చను" మన్నది. అది యెట్టి సత్కారమో? ఇంతవఱకు మాటలు వంకచుట్టుగనే జరిగినవి. నడుమనడుమ ప్రవరుని ముఖమును గమనించినపుడు కొన్ని భావరేఖలు గానుపించినవి. ఇఁక సమేళ మొప్పఁగా నక్కున గారవించు ననుకొన్నది పాపము. నిజముగఁ బ్రవరునికిఁగాను కథ ముగిసినది గాని వేతెట్టి ప్రాణియైనను సంక మంత మొంది యుండెడి దే.

వరూథిని మాటలలోని సార మర్థమైనది ప్రవరునకు. ఆతఁడేమి లోకవృత్తమును దెలియని మూఢుఁడా! సమగ్రముగ విమర్శించి తత్త్వముమూటగట్టిన మహానుభావుఁడుగదా! తానును డొంకతిరుగుడుగనే సమాధానమిత్తమనుకొన్నాఁడు. చూపినబాంధవ్యమును మఱింత దృఢపరచి మనలో మనకు భేదము లున్నవా! భుజించి నిద్రించి పోయిననేనా కృతార్థత! ఆమాత్రము పిలిచి యాదరించుభక్తియే పదివేలు గాదా" యని వ్యవహారపు మాటలాడి తిన్నగఁ దనసోదె నారంభించినాఁడు. అగ్నిహోత్రుఁడు, జపము, తపము, తలిదండ్రులు అందఱిని పనవి పనవి యేడ్చినాఁడు. ఇల్లని కలవరించినాఁడు. తన్నుఁబోనిమ్మన్నాఁడు. తా నింటికిఁ బోకున్నచో దురంతమగు కర్మహాని వాటిల్లు నని లోనున్న మహాపదను విప్పిచెప్పినాఁడా యాహితాగ్ని.

ఎంతవఱ కాగఁ గలదు వరూథిని! ఎక్కడి యూరని యీసడించినది. ఒకచోట నీకు కాలు నిలుచునట్లు లేదే! యని విసుగుతోఁ గసరించి స్పష్టముగ విప్పి చెప్పినది. "నీపయిని మనసు చిక్కినది. నీవే నన్ను రక్షింపఁ గలవాఁడవు. లేకున్న విరహవేదనచేఁ గ్రుంగిపోదు" నని తన ప్రాణము లాతనియొడిలో నుంచినది! ఆసోమయాజి కీ కొసరింతలలో జాలి గలుగునా? "వ్రతులై దినములు గడపెడు వారిని కామింపరా దని" పీనల్‌కోడ్డు నెత్తి చూపినాఁడు. ఇక నేమి

కార్యము? శాస్త్రపండితుఁ డగు ప్రవరు నూకొట్టించుట కను భవవాదము చాలలేదు. అయిన నూఱకుండవలసిన దేనా? లేదు. గుండెకు నీరు దట్టుకొని మఱల హేతువాదములకు డీకొన్నది. తొలుత "యజ్ఞములకు ఫలము లప్సరసల కౌఁగిళ్లని" మీమాంస నండగఁ గొని యచ్చుకట్టు గూర్చుకొన్నది. ఈ యెలప్రాయము వైదికకర్మలకుఁ బోనిచ్చిన నిఁక భోగము లెప్పుడని యాశచూపి నది. ఆసుఖ మిప్పుడే తనకుఁడానై సంప్రాప్తించ సిరి రా మోకాలొడ్డుదువేమయ్యా పిచ్చివాఁడా! యని లాఘవ మాచరించినది. సశరీరస్వర్గసుఖ మని యొకయుత్కృష్టతను ప్రత్యక్ష ప్రమాణముచే స్థిరపరచినది. ఇఁక సర్వవిధముల విప్రుఁడు పంజరములోని పిట్టవలెఁ గుక్కుమిక్కునక లొంగి పోవు ననుకొన్నది. కాని యట్లు జరుగలేదు. "నీవన్న యర్థ మెల్ల నిజము కాముకుఁడైనవాని" కని యొక్కమాటతో లక్ష్యభేదము చూపి పైవాదమునెల్లఁ దుంటలు గొట్టివాఁడు.

కడకుఁ గడపటి యత్నముగ ద్విగుణీకృతోత్సాహ ముతో ముందుకు నడచి నడుమునచేయి నాని "అథారిటేటివ్" గా మాటలాడ నారంభించినది. "ఆనందో బ్రహ్మ" యను బుక్కున కర్థమేమయ్యా! ఆనందము పరమార్థమని కాదా! ఆనందము సుఖములో లేదా! యింతటి యన్యాయమా!' యని వాదించినది. ఆ యుపనిషదర్థముతోఁ దన సిద్ధాంత

వరూధిని మాటలలోని సార మర్థమైనది ప్రవరునకు. అతఁడేమి లోకవృత్తమును దెలియని మూఢుఁడా! సమగ్రముగ విమర్శించి తత్త్వముమూటగట్టిన మహానుభావుఁడుగదా! తానును డొంకతిరుగుడుగనే సమాధానమిత్తమనుకొన్నాఁడు. చూపినబాంధవ్యమును మఱింత దృఢపరచి మనలో మనకు భేదము లున్నవా! భుజించి నిద్రించి పోయిననేనా కృతార్థత! ఆమాత్రము పిలిచి యాదరించుభక్తియే పదివేలు గాదా" యని వ్యవహారపు మాటలాడి తిన్నగఁ దనసోదె నారంభించినాఁడు. అగ్నిహోత్రుఁడు, జపము, తపము, తలిదండ్రులు అందఱిని పనవి పనవి యేడ్చినాఁడు. ఇల్లని కలవరించినాఁడు. తన్నుఁబోని మ్మన్నాఁడు. తా నింటికిఁ బోకున్నచో దురంతమగు కర్మహాని వాటిల్లు నని లోనున్న మహాపదను విప్పిచెప్పినాఁడా యాహితాగ్ని.

ఎంతవఱ కాగఁ గలదు వరూధిని! ఎక్కడి యూరని యీసడించినది. ఒకచోట నీకు కాలు నిలుచునట్లు లేదే! యని విసుగుతోఁ గసరించి స్పష్టముగ విప్పి చెప్పినది. "నీపయిని మనసు చిక్కినది. నీవే నన్ను రక్షింపఁ గలవాఁడవు. లేకున్న విరహవేదనచేఁ గ్రుంగిపోదు" నని తన ప్రాణము లాతనియొడిలో నుంచినది! ఆసోమయాజి కీ కొసరింతలలో జాలి గలుగునా? "వ్రతులై దినములు గడపెడు వారిని కామింపరా దని" పీనల్‌కోడ్డు నెత్తి చూపినాఁడు. ఇఁక నేమి

కార్యము ? శాస్త్రపండితుఁ డగు ప్రవరు నూకొట్టించుట కను
భవవాదము చాలలేదు. అయిన నూఱకుండవలసిన దేనా? లేదు.
గుండెకు నీరు దట్టుకొని మఱల హేతువాదములకు డీకొన్నది.
తొలుత "యజ్ఞములకు ఫలము లప్సరసల కౌఁగిళ్లని" మీమాంస
నండగఁ గొని యచ్చుకట్టు గూర్చుకొన్నది. ఈ యెలప్రాయము
వైదికకర్మలకుఁ బోనిచ్చిన నిఁక భోగము లెప్పుడని యాశచూపి
నది. ఆసుఖ మిపుడే తనకుఁదానై సంప్రాప్తించ సిరి రా
మోకాలొడ్డుదు వేమయ్యా పిచ్చివాఁడా! యని లాఘువ
మాచరించినది. సశరీరస్వర్గసుఖ మని యొకయుత్కృష్టతను
ప్రత్యక్ష ప్రమాణముచే స్థిరపరచినది. ఇఁక సర్వవిధముల
విప్రుఁడు పంజరములోని పిట్టవలెఁ గుక్కుమిక్కునక లొంగి
పోవు ననుకొన్నది. కాని యట్లు జరుగలేదు. "నీవన్న యర్థ
మెల్ల నిజము కాముకుఁడైనవాని" కని యొక్కమాటతో
లక్ష్యభేదము చూపి పైవాదములెల్లఁ దుంటలు గొట్టినాఁడు.

కడకుఁ గడపటి యత్నముగ ద్విగుణీకృతోత్సాహ
ముతో ముందుకు నడచి నడుమునచేయి నాని "అథారిటేటివ్"
గా మాటలాడ నారంభించినది. "ఆనందో బ్రహ్మ" యను
బుక్కున కర్థమేమయ్యా! ఆనందము పరమార్థమని కాదా!
ఆనందము సుఖములో లేదా! యింతటి యన్యాయమా!"
యని వాదించినది. ఆ యుపనిషదర్థముతోఁ దన సిద్ధాంత

మనుగూడ జోడించి చలాకీని గనబరచిన దా నూతన విద్యార్థిని. దాని కుత్తరమే లేదు. దానితత్తరము చూచి వెడనవ్వు నవ్వినాఁ డాతఁడు. "తల్లీ! యివన్నియు మీ సిద్ధాంతములు. మాయర్థములు మీ రంగీకరింపరు. మీ యుపన్యాసములు మాకు నచ్చవు. మాభాష్యములు వేఱు. మాగురువులు వేఱు పోయివత్తును; సెలవని పాదములు వెనుక కీడ్చినాఁడు. నిస్పృహాత యాతని ముఖమునందు స్పష్టముగఁ జిత్రితమై యున్నది. ఇఁక నిలువలేక పోయిన దాగోల. మోము వెల్లనయినది. హృదయము కందినది. కంట నీరువెట్టి "పుల్కుపుల్కున" జూచినది. ఇంతవఱ కనుభవించిన యవమానము అనుభవింపలేనే యను కడుపు లోని దుఃఖము చెప్పినమాట వినఁడే యను కోపము వీని కన్నిటికిఁ బైన చాపల్యము మెఱపులవలె మెఱయుచున్నవి. మనసు మఱలుట లేదు. "పోనీలే" యను నభిమానమో శాంతియో జీవికయందే కానము. యేమి చేయవచ్చును ? దీనస్వరూపిణియైనది వరూధిని. అప్పటి యామె హృదయా వేదన రౌరవమునకన్న ఘోరమైనది. మనవలె మనుష్య కాంత గాదుగదా దుమికి చచ్చుటకు. లేదా ప్రవరు నే యుపాయముచేత నైనను బొందవలెను. కాకున్న బ్రతికి యుండవలె నింతే యామె పెగతి. గట్టిగఁ గన్నులు మూసికొని యొక్కసారి సాహసింత మనుకొన్నది. ఎంతగొప్ప సిద్ధాంత

ములు నేర్చియున్నను కావ్యభాగమున సంపదలును పట్టమే గదా! ఒక్కసారిగఁ బాలిండ్లయంచులు మోపి గట్టిగఁ గౌఁగిలించుకొన్నది. ఆక్షణమున నేమి యానందకణిక ననుభవించెనో యంతే. మఱునిముసముననే యాతనిచేఁ ద్రోపువడి నిలచినది. హరిహరీ! ఆదుస్థితి దలపఁదగినవాఁడు తలఁచనుఁగూడరానిది. మఱలి ప్రవరునిఁ జూచినది. ఇంత యయ్యెఁగదా! "లజ్జాపరవశనైనను" కోరిక మూసినదా! చనుమిట్టల నశ్రువులు చిందువాంద వేదననెపమిడి కలస్వనము లో నేడ్చినదట. ప్రవరుఁడు మఱల పలుకనే లేదు. ఆమె జవ్వాదిచేఁ గదంబించు నొడలు గడుగుకొని వార్చి యగ్ని దేవుని యాశీర్వాదమున నింటిదారిఁ బట్టినాఁడు.

వరూధిని కాభిజాత్యము లేకపోలేదు. అది సహృదయతను మఱపించదు. సిగ్గు కావలసినంత యున్నది. అది మనోరథము నెదిరించి నిలువలేదు. నేర్చిన విషయము లనుభవమూలమునఁ గడిదేరినవిగావు. నయమున, భయమున, విలాసమున, చాతుర్యమున సర్వవిధముల బోధించి చూచినది. సరసత్వమునఁ బుణ్యపాప విచార మంత లే దని యామె చిన్ననాటినుండి యెఱింగిన విషయము. మనసుగలిసి మమతయున్నచోట నసఁగి పెనఁగి యుండుటయే జీవిత పరమావధి యని యామె యర్థముఁ జేసికొన్నది. పరాశరుని దాశకన్యాకేళి. గాధిపట్టి మేనకతో నొనరించిన

చుట్టఱికము, మాండకర్ణియొక్క నాగవాసముల చెలిమి, అహల్యా జారత, యివి యామె మనోభిప్రాయము నిశ్చితముగ నుండుటకై మొదటినుండియు తీరి కూరుచున్న యుదాహరణములు.

పరోపదేశమునఁ బదియాఱులెక్కవఁ జదివిన పండితులిది యనౌచిత్య మని వాదింపవచ్చును. నిజమే వలపెఱిఁగి వచ్చువానితోడి సరసము గాని పాటిలేని ఛాందసునితో నేమి పని? వేఱొకఁడు కులశీలసమన్వితుఁడు, రూపవంతుఁడు దొరకఁడా? పోనిమ్మని యూరకుండ రాదా? ప్రపంచములోని పరమార్థమే యిందులో నిమిడియున్నది. లౌల్యమును విడిచినవాని నెదిఱించు పదార్థమే ప్రపంచమున నుండదు. మఱుసటి దినమే వాఁడు మోక్షమునకు నిచ్చెనను నిర్మింపవచ్చును. కాని విడుచు టెవరి వూట! నల్లమందుతిని తూగాడువారి నెంతమందిని జూడము. అల్పాహారము మంచి దనియు, కడుపులకు వేసికూరుట చెడుగనియు, నాయుర్వేదము చాటుచున్నదిగదా! మనపండుగల పరమార్థము రానురానెట్లు మాఱినది? కడుపును "గ్రంతలతిత్తి"గఁ జేయుటయేనా, వేతేమైనమున్నదా! మన తండ్రితాతలు కాఫీపానీయమును ద్రాగ లేదుగదా! కాఁగా మనదేశపు శీతోష్ణస్థితి కది యంటదనియు నెఱుఁగుదుము. వదలుచున్నామా? బైకలతో నున్న యాఁడుదాని కేజ్ఞమట్టిపైఁ గల మక్కువకన్న

మనకు కాఫీపై నభిమానము మెండనుటకు సందేహామున్నదా! ఇంటఁ బెండ్లాము చీదరించుకొన్నఁ దండ్రి పండ్లునూరినను చెట్లుచాటుననో గోడలవెనుకనో సిగరెట్టుఁగాల్చి - యేమియు నెఱుఁగనివారివలె గుప్పుచప్పిడిగా దొడ్డిదారిలో నింటఁబడు వారు లేరా! కొందఱికి పేకాటలలో సరదా. కొంచెము పట్టుదలను వినియోగించినచో నివన్నియు విడువవచ్చును గదా! ప్రయత్నించు చున్నామా! బాహాటముగ నెవపైని చేయివైచి చెప్పువార లెందఱో లేర ను కొం దు ను. ఇట్టి య ల్ప వి ష య ము ల యం దే మ న ని వృ త్తి యింత ముచ్చటగ నున్నదే, యిఁక బ్రహ్మదేవుఁడే పుట్టుకతోఁ దయారు చేసియిచ్చిన వానియందు మాత్రము మన నిగ్రహ మెంత లక్షణముగఁ బనిచేయును? మనమాట యేమిగాని కొమ్ములు దిరిగిన విజ్ఞానులు పెద్ద "కచ్చడాలు" మొలలకు బిగించిన ము ను లు నీ యుద్యమమునకుఁ బ్రయత్నించిరే! వారిలో నెందఱు కృతార్థులైరి? సౌందర్యము మనోహారిత్వ మున్నచోట నాశించుట మానవస్వభావము. కాదని వాదించువాఁడు, పుస్తకముల వల్లెవేసిన పండితుఁడే గాని ప్రపంచమును బరిశోధించిన యనుభవశాలి గానేరఁడు. అయిన నివృత్తి యను ధర్మయే యక్కఱలేదా! అది గాదు నేనన్నది. లౌల్యము ప్రపంచమున విడదీయరాని గొప్ప రహస్యములలో నొకటి. నివృత్తియందుకన్నఁ బ్రవృత్తియందు

మనసు సులభముగఁ బరుగిడును. అట్టియెడ హృదయము నరికట్టుటకు గొప్ప మేధస్సు గావలెను. ప్రపంచమున నందఱు విజ్ఞానులుగనే యుండరుగదా! అట్టియెడ నొక వ్యక్తి యందు దోషలేశ మున్నంతనే వాఁడు పనికిమాలినవాఁడని సిద్ధాంతీకరించుట పొరపాటుగాదా? వాని తక్కిన గుణము లెన్నియున్నను, దీన నొకదానితో నన్నియు దోషములుగనే లెక్కించు పిచ్చి యెందరికి లేదు? నేను విద్యార్థిగా నున్నప్పు డొక్కసారి వేణీసంహారమును జదువుచుంటిని. యుద్ధవార్త ప్రకటింపఁబడిన తరువాత దుర్యోధనచక్రవర్తి భానుమతితో సెలవు గైకొనుటకై వెళ్లును. ఆ ఘట్టమును జదువుచు, "స్వామీ! ప్రకటింపబడిన యుద్ధమేమిటి? ఇక్కడ నసభ్యముగ వర్ణించిన యీవిషయ పిపాస యేమిటి? దుర్యోధనచక్రవర్తి కింతమాత్ర మౌచిత్యము నూహించు తెలివిలేదా?" యని యడుగఁగ వారు, "నాయనా! లేకున్న నాయక ప్రతినాయకు లకు భేదము గానఁబడదు. అందులకే యీయంకమును బ్రారం భించినాఁడు మహాకవి భట్టనారాయణుఁ" డని సెలవిచ్చిరి. నాకు నిజముగఁ గడుపు చెక్కలగునంత నవ్వు వచ్చినది. మాగురు వులు మాననీయులు. వారిని దూషింప నాయభిప్రాయము గాదు. మనదృష్టి యిట్టి దని విన్నవించుటకే యొక ఘట్ట మెత్తి చూపితిని.

అసలు - నివృత్తిధర్మ మెంత ముఖ్యమో ప్రవృత్తియు

నంతటిదే. బ్రహ్మదేవుని కాయింత లౌల్యము లేకున్నచో ప్రపంచమే పుట్టియుండదు. శంకరుఁడు భీష్మించి కూర్చొని యున్నచోఁ దారకాసురునిఁ జంపు మగవాఁడు మనకుఁ గాడు, దేవతల కెక్కడుండును? ఇఁక విష్ణువున కెంత లాలసతయున్నదో యవతారము లెత్తినపు డెల్ల వేషములు మార్చి మార్చి యల సిన లక్ష్మీదేవి నడుగుఁడు. మానవులమగు మనకు మాత్రము ప్రవృత్తిరూపమగు లౌల్యము లేకున్నఁ బని జరుగునా? అందఱు కావిపంచెలుగట్టి సన్న్యాసులైనచో నపుడు భిక్షఁబెట్టుసంసారి యెవఁ డుండునో యోచించి చెప్పుఁడు చూతము.

కొందఱు "మనజీవిత మెటు లున్నను కడకు ప్రపం చానుభవ మేరీతి నున్నను నున్నతాదర్శములు మాత్రమే కళల యందుఁ జూపవలెను. నైతికదృష్టి లేనిది కళయే గా" దని వాదింతురు. గొప్ప ప్రశ్నయే కాని కళయొక్క పరమావధి నీతియే గాదు, ఆత్మానందము. నీతిలేనిచోట నానందమే లేదనునది శాస్త్రపుమాట. కళలో నీతియే యుండ రా దని కాదు నాతలఁపు. నీతిలేని చోట కళయే లే దన రా దని. ఆరీతిఁ జిత్రించుట కవి కనావశ్యకము, అశక్యమును. తాను దృశ్య మాన ప్రపంచమున నుండి విషయవికారము లంతయో యింతయో యనుభవించుచుఁ దనచేతితోఁ దనమెదడుతోఁ దనహృదయముతోఁ దయారైన పాత్రముల మాత్రము

కేవల ధర్మస్వరూపములుగఁ జేసి యున్నతాదర్శములనే వారి బొజ్జ నెట్లు నింప గలఁడు? లేదు. "కవి ప్రతిభాశాలి, అతని మనస్తత్త్వము - అతని జీవితమే వేఱుగ నుండును. కాన కవి తయారుచేసిన పాత్రములు గూడ నాదర్శ భూతములుగనే యుండు" నందురా? సత్యమే. పరమ సత్యమును గావచ్చును. అట్టికావ్యములు మనవాఙ్మయమున నెన్ని యున్నవి? కావ్యము లన్నిటను శృంగారమును బచ్చి పచ్చిగ వర్ణించి కడపట "కనుక నిట్లు చేయరాదు" అను నొక్క చిన్న నీతిముక్క నతికించినచో సత్యస్వరూపమును బోధించి నట్లగునా? నాట్య మనునది లోకవృత్తానుకరణ మని భరతముని వాక్రుచ్చెను. సంగీతమున రాజసతామసములే మనుష్యులకుఁ గాని కేవలసాత్త్వికము దేవతలపా లనిరి. చిత్రలేఖనము మొదలగువానియం దంతయు భావాభివ్యక్తీకరణమే ప్రధాన మనిరి. నగ్నచిత్రములయందు సౌందర్యము కళా భాగ మున్నది. అట్టివానిజతలోనే పెరిగిన కవిత్వమునందు మాత్ర మన్నిటియందును లేని నీతి యెక్కడ వచ్చినది? నీతిని, సౌందర్యమును రెంటిని జోడించి చెప్పువాఁ డుత్త మోత్తముఁడు గావచ్చును. కాని నీతిలేనిచోట నంతయు కళా వేశమే లే దనుట పొరపాటు గదా!

ప్రాచీనులలోను వివిధములగు నీ వివాదములు లేక పోలేదు. ఆనందవర్ధనుఁ డానందోపాసనయే కావ్యపరమార్థ

మనెను. కావ్యప్రకాశకారుఁడు "నియతికృత నియమ రహితాం" అని మధురమధురముగు లక్షణమును నిర్వచించెను. అలంకారికుల కెల్ల నర్వాచీనుఁ డనఁ దగు జగన్నాథపండితకవి "రమణీయార్థముగల శబ్దమే కావ్య"మని చాటెను. అయిన నీ నైతికవాద మెక్కడనుండి దిగుమతియైనది? శాస్త్రవీథుల నుండియే సరఫరా యైనది. నీతి కొకవిధ మగు నిర్ణయము లేదు. నేఁ డొకనీతి, రేపొకనీతి. దేని ననుసరింపవలెను? ఈనాటి బ్రాహ్మణుఁడు చాతుర్వర్ణ్యములలో వివాహమాడరాదు గదా! మఱి పూర్వకాలమున నివియన్నియు శిష్టాచారములుగ నుండినవి. వాని నన్నిటిని మనమీనాటి దృష్టితోఁ జూచి నేరమని తిరస్కరింపవచ్చునా? ఒక శతాబ్దిలోని నీతి వేలు కాలముల నుండదు. నేటి ముసోలినీ నీతి ఆదరింపఁదగునీతి. ఈనాటిపరిస్థితి ననుసరించి యిది నీతి. ప్రాగ్జ్యోతిషపురాజుబిడ్డ నగ్నిదేవుఁ డనుగ్రహించినాఁడట! అచటి వారందఱు స్వైరిణు లైరట. ఇట్టివి తడవఁబోయిన నెన్నియో గలవు. కొందరు నీతియుఁ గాలదేశపాత్రముల ననుసరించి మాఱు నంటిరి గదా! కాన ప్రతిదానను నైతికస్వరూప ముండనే యున్నది. గ్రహించువాని దృష్టియందే భేద మున్న దని వాదింతురు. కావచ్చును. అడ్డుపడినచోటుల నెల్ల నచ్చుకట్టురాళ్ళను వేసి, నీతిని సవరించి పట్టించుటలో నంత నిశిత మగు దృష్టి

యున్నపుడు, దానినిగూడ నొప్పుకొందుము. కళ కద్దురాని నీతి యెంత యున్నను మాకు పరవాలేదు. అది కళాభివృద్ధికి భంగకరమైననే మాచింత. మఱికొందఱు 'నీతిలేని విశృంఖల మగు కళకు చోటే యియ్యము. సంఘమునకు జాతికి తోడుపడు నంత వఱకే గదా! మనకు గళయుపకారము; కనుక, మితముగ వాడుకొందు' మందురు. ఇది రుచిభేదమునకుఁ జెందినది. దీనినుండి సిద్ధాంతమున కేమి బాధ లేదు. అట్టి వారికి వేదములు, ఉపనిషత్తు లుండనేయున్నవి. వానిలోను పై దోష మంతయో యింతయో లేకపోలేదు. తక్కినవి పనియే లేదందురా? కానిండు! అందఱు గలసి బండ్లు గట్టించి గంగానదిలోనికిఁ దోలింతము.

మనయనుభవము మన జీవితము దాని ననుసరించిన మనకళ యన్నియు నీరీతిగనేయుండఁ బాపము పెద్దనపైనను నతిసుకుమారి యగు వరూధినిపైనను మాత్ర మీ శిలాపాత మేటి న్యాయ్యము? అందఱు కవులకు లేనిది పితామహునికొక్కనికే వచ్చినదా యీ యవినీతి? వాత్స్యాయనుఁడు కామశాస్త్రము బ్రహ్మాండ మంతటి గ్రంథమును వ్రాసినాఁడు. ఒకటి రెండు ప్రకరణముల మాత్రము పతివ్రతాలక్షణము, స్త్రీరక్షణ మొదలగు నెండుముక్కలు విసరి, తక్కినదాని నంతయు లాలసతకుఁ బనికివచ్చు చుంబనాదులు మొదలగునవి

నిరూపించినాఁడు. కడపట నేను చెప్పిన దంతయు వ్యతిరేక విధముచే గ్రహింపవలె నని దిద్దిపోయినాఁడు. ఇట్టి వన్నియు న్యాయము లైనచోఁ బెద్దన వరూథినీవృత్తాంతమును గూడ వ్యతిరేకవిధిచేతనే గ్రహించి పాప మాకవినిఁ దరింపఁజేయు దము లెండు.

ప్రవరునిదియు నిందు దోష మనుట మహాపరాధము. అతఁడు శ్రోత్రియుఁడు, ఆహితాగ్ని. వారిపూర్వులు యజ్ఞము లాచరించి పవిత్రులైన వారు. తానును నిరంతరము హవ్య గంధమునే యాస్వాదించిన మహనీయుఁడు. జననీజనకులసేవ, పెద్దలయెడ వినయవిధేయతలు, అతిథిసంతర్పణలు – వీనితోనే యాతని యనుభవ మెదిగివచ్చినది. "అగ్నులు, అతిథులు ప్రియములై నట్లతని కన్యములు గావట." హిమాలయ పర్వతమునఁ గడుపుమాడుచున్నను "అయ్యో! నిత్యవ్యవ హారములు వోయెనే" యనియే పెద్దదుఃఖము. కూకటులు గొలిచి చేసిన కూరిమిసోమిదమ్మ మనసులో వర్తించునది. పూర్వపురాజు లొసఁగిన మడి మాన్యములు, తఱుగులేని పాడి. దేవిదేవరవోలు తలిదండ్రులు. దేవుఁ డిచ్చిన రమ ణీయమగు సౌందర్యము. ఇట్టియెడ నా మహానుభావునికి లోటేమైన నున్నదా? ఆ ధర్మమూర్తి యైహికాముష్మిక ముల రెంటిని గడముట్ట ననుభవించినవాఁడే; కేవలపాషాణ హృదయుఁడు గాఁడు. మఱి పదార్థముల పరిమితి నెఱిఁగిన

మేధావి. మనసును నిగ్రహించిన మహనీయుఁడు, ధర్మము - కర్మము సమగ్రముగ గలవాఁడు. పేరునకుమాత్రము "కచ్చడాలు" బిగించి, యాడుదానినీడ సోకిన వెంటనే కృష్ణాజినము చంకనిరికించి వెంటఁబడు "ముని ముచ్చు"గాఁడు. ఆర్భాటములేని సదాచారి. ఆచారము తనకొఱకేగాని డాంబికమునకుఁ గాదని యర్థము చేసికొన్న తపస్వి. తన మతమునందు, తమసిద్ధాంతములయందు నమ్మకము సంపూర్ణముగ సంపాదించుకొన్న మనస్వి. విజ్ఞానముచేఁ బండి, ఫలించిన, తలఁపులు గల పవిత్రుఁడు. ఏకాంతమున నుండి స్వైరవృత్తి కాశించిన పరవనితను ద్రోసిపోయినాఁ డన్నచో మనకు రోష మేల? కలుగు రసభంగ మేమి? ప్రపంచములో నట్టివా రుండరే యని చింతయేగాని నిజముగ నున్నచో బ్రహ్మరథమును బట్టఁ జాలమా? వరూధినియం దెంత మానవత్వ మున్నదో ప్రవరుని యం దంతమహ త్తున్నది. అతని నివృత్తిలోని వేయింట నొక పాలైనను మనకు లేదేయని యేడ్చుట పోయి నిందించుట నిశ్చయముగఁ దెలివితక్కువపని.

మఱికొందఱు మహానుభావులు మనుచరిత్రమునకే శాపోదకములు విడుతురు. వారి వాదము విందముగాక. "మనుచరిత్రమున రసమే లేదు. అంతయు రసాభాసమే. రెండవయాశ్వాసమునఁ వరూధినియందే యనురాగము. మూఁడవయాశ్వాసమునఁ బ్రవరునిపేరుచెప్పి యేగంధర్వుఁడో

క్రీడించిపోవును.-ఉత్తమగుణములు గల ఘట్టమే లేదు. అంతయు మోసము, అసహ్యము."

నాకుఁ జూడ నీవాదమున సంస్కృత హృదయమే గాన రాదు. సుఖమన్న నే మనకంతులేని యసహ్యము,—ద్వేషము గలుగును. కారణ మేమి? మనయల్పతృప్తి. అదియే వీనికి మొదటిబీజము. కనఁబడిన దంతయు రసాభాసమైయైనచో నీఁక నంతమే యుండదు. అనురాగ ముభయుల యందు నిండి యున్నచో శోభించు ననుట నిజమే కాని యట్లు లేనివన్నియు పరిత్యాజ్యము లనియు, అట్టికథ లన్నియు చదువరానివే యనినచో చాలావాఙ్మయము దాచిపెట్టవలసి వచ్చును. అట్లే యైన పూర్వపు స్వయంవరములలో నెన్ని రసాభాసములైననో యొకరస మగుచుండెడిది. రాక్షస వివాహము లన్నియు రసాభాసములు గాఁ గూడదా? వివేకమైనను మందువలె వాడు కోవలసినదేగాని తెగఁ బెంచినచో లోకన్యాయమునకు ముప్పే.

పోనీ యారసాభాసమైనను ఇక్కడెవరిలో నున్నదో కొంత నిదానముగా నిలిచి పరికింతము. వరూధినీ ప్రవర్తన మున రసాభాస మున్నదందురా? ఆమెపుట్టువు "పూతపసిఁడి" వంటి వలపుగల సానివారింట సభలు, రంగములు, ఆటపాటలు నిత్యవ్యవహారములు, కళోపాసనతోఁ బక్వమై పూవులకన్న మెత్తనగు మనసు. వారికి శీలమునుగాని యుదాత్త గుణము

లను గాని చెడక నిలుపుకొను పట్టుదల లేదు. కంటికి కింపయిన చోట వలచుట, తరమయిన ననఁగి పెనఁగి సుఖించుట వారి నైతికచర్య. వరూథిని లోకోత్తర యగు నాయిక గాదు. సరిగదా ఆత్మగుణములకై యత్నించి సాధించి ఔత్కృష్ట్యము నిలుపవలె నను కోరికయు నామెకు లేదు. దృష్టియే సున్న. కంటికిఁ జల్లగ నున్నాఁడు ప్రవరుఁడు. కామించినది. తొలుత ననుభవమును జూపించినది. విప్రుఁడు లొంగ లేదు. హేతువాదములకుఁ దిగి తర్కించి చూచినది. అన్నిటికన్ని చెప్పి యొప్పించి నిలిచినాఁడు. ఇఁక మాటలలో సాగ దనుకొని కార్యమునకు దిగినది. విశ్వామిత్రుఁడు మొదలగువారు తొలుత నిట్లు వాదించినవారే గదా! అనుభవములో నే మైనారు? కనుక పాప మామె యీ వేదాంతములన్నియు నాడువారి పొలకువ లేనంతవఱకే దానియంగము సోకనంత వఱకే.—తఱువాత నిలువ రని తలచినది. కడపటియస్త్ర ముపయోగించినది. అదియు మొక్కవోయినది. ఆప్రాంత ముల నంతట నింతట నెవ్వరును లేరు. సంపూర్ణమగు నేకాంతము. కనుక నే, వెనుకాడక, ఏకాంతధార్ష్ట్యమునకు దిగినది. వెఱ్ఱిగ నర్థము చేసికొన్న నే తప్పు యదియును నంత క్షమింప రాని దోషముగాదు.

ఇఁక ప్రవరునిది పొరపాటని పెదవి విప్పు ధైర్యము మన కున్నదా? రామరామ! అతనిజీవితము పరమపవిత్రమైనది.

ఎన్ని యో సంవత్సరములు మననగావించినను మనతలఁపున కందని మూర్తియాతనిది. మఱి రసాభాసమున కేమియర్థము? విభావానుభావాదులచే క్రమపరిపుష్టమయిన రసమే స్థాయిభావత నంది చర్వణాయోగ్య మగుచున్నదిగాని నడుమనే తునుకలైనచో నఖండమై సంపూర్ణమైన యానందము గలుగదను భావము గావచ్చును. న్యాయమే. ఈ యల్పతృప్తి కెక్కడికి పారము? దినమును పండుగభోజనమేయైన సంసారి 'పాపరు' వేయఁడా? ఎవఁడో తిరిపెగాఁడు "తల్లీ! ఉద్దరకుఁ బెట్టినను మగని తోడుత బెట్టుమన్నాఁడట." పోనిండు. మన కావ్యములలో నాయికా నాయకుల మనస్సుల నన్యోన్య ప్రేమచేఁ బెంచి పెద్ద చేసిన ఘట్టము లెన్ని యోయున్నవిగదా! వానియందును సమగ్రత యున్నదా? మిగిలిన చెద లెన్ని పట్టలేదు? వానినన్నిటిని మనము దిద్దుచున్నామా? అవిమాత్రము రసము నాస్వాదించుటలో నడ్డుపెట్టి యతృప్తిని గలిగించుటలేదా? అన్నిటికి లేనిదీరసాభాసమున కొక్కదానికి మాత్రము పట్టినదా యీ బహిష్కారము? తొండలఁ దిన్నవారు, నక్కలఁ దిన్నవారు దోషులైయుండ నడుమ గారెల దిన్నవారిదేనా మహాపరాధమని యెవఁడో శిష్యుఁడు గురువుల కుత్తరమిచ్చినాఁడట. మానవులచరిత్రము స్వభావము పలురీతులుగ నుండును. దానినంతయు సమగ్రముగ నాలోచించి సముచితముగ నాయాచోటుల నిలుపు

మేధాశాలి యెవఁడుండును? ఒకవేళ నిర్మించెబో, పరమాదర్శ పురుషుఁడగు వానితో మన మెంతవఱకు లాభమందఁగలము? మనతోడనే యుండి మనవలెనే కష్టసుఖములు, చింతలు, చాపల్యములు గలిగి సర్వవిధముల మానవుఁడై యాధ్యాత్మిక వీథుల కాతనిఁబాటు మనలను దీసికొనిపోవలెను. కేవలము ఆదర్శపు ముద్దయే యైనచో మనభావన లరిగించుకొనలేవు. అపుడు లాభ మేమి? సంపాదించుకొను నజీర్ణమే.

ప్రతియొకచోట నొకఁటే నాయికానాయకులు, ఒకటే యచ్చుకట్టున్నచో, మఱి వేఱు వేఱు కావ్యము లెందుకు? వేఱు వేఱువ్యక్తు లెందుకు? విభిన్నములగు మెదడు లెందుకు? నైషధములోని చంద్రదూషణ, మాఘములోని మారుత నిందలే ప్రతికావ్యమున నుండవలెనన్నఁబార మున్నదా? కవుల మనస్సులను, భావములలు స్వతంత్రత సరికట్టుసంకెలలు గావా యివి? అందుకే మనభాషలో నిన్ని తలతోకమార్పులు, ముసుగు దొసగులు అవశ్యముగా నుండవలసినది మనకర్మ యైనది. ప్రారంభింపఁబోయిన నితివృత్తమునుగాని రసమును జూచి చక్కఁగ నిర్వహింపలేక చదికిలఁ బడినచో దోష మగును గాని బుద్ధిపూర్వకముగఁ జేసిన పనికి వీరి ప్రాయశ్చిత్తము పరిహాస మనుటకన్న వే ఱున్నదా? పెద్దన యితివృత్తమును సర్వాంగసుందరముగఁ

జిత్రించ లే దను మహానుభావు లుండ రనుకొందును. నాకు మాత్ర మాధైర్య మేమాత్రమును లేదు. నిజముగఁ బితామహుఁ డుత్తములలో నుత్తముఁడు. అతని నొకమేనాలోనే గాదు; పదివేల మేనాలలో మార్చిమార్చి కూర్చుండఁబెట్టి ప్రపంచమంతయుఁ ద్రిప్పినను దక్కువే. అయిన తప్పెవరిది? మిత మెఱిఁగిన కవిదా? ఇచ్చినదానితోఁ దృప్తిపడక పేరాసతో నోరు దెఱచి యాచించుమనదా ? ఆత్మతృప్తి లేకున్నచో దీనియం దేమి. ప్రపంచమున దేనితో నానందము గలదు?

వరూధిని ప్రేమ పవిత్రమైనది. ఏకొఱఁతయు, నేదోషము నాకొమరాలి మనస్తత్త్వమునఁ గానఁబడదు. ఇఁక నిలుచున దేమి? ఆమె ధార్ష్ట్య మసంగత మనున దొక పూర్వపక్షము. వరూధిని ప్రవరునిపైఁ బడినదే రచ్చకట్టలోను గాదు. ఎవ్వరికంటనుఁ బడని యేకాంతమున నొంటరిగ నున్నపుడుగూడ వలచినవారిపై—ఆమాత్రపు స్వాతంత్ర్యమునకు స్త్రీలు తగరా! ఆలంకారికులే యీ సూత్రము నంగీకరించిరి. కాని దేవుఁడు వర మిచ్చినను—యీపూజారు లంగీకరించుట లేదు. ఇంతకు వరూధిని సాని యని మనమందఱ మెఱిఁగిన విషయమే. పెద్దగ నాదర్శవాదమును సమర్థించి లెక్కెమును నిలుపవలె, నను పేరాసయుఁ బట్టుదలయు నాకెకు లేవు. వరూధినికిఁ గలిగిన యీయింత సహృదయత గూడ కళారాధన యిడిన భిక్షయేగాని వేఱుగాదు. అట్టిచో

నామె జీవితము నింత గంభీరముగఁ దఱచితఱచి చూడవలసిన యావశ్యకతయే లేదు. నిజముగా నిట్టి నైయాయికదృష్టితో విమర్శింపఁజొచ్చినచో—వరూధిని యేమి, యెవ్వరును యొఱపిడిరాతికి నిలువరు. అది యట్లుండె.

ఇఁక గంధర్వసమావేశ ఘట్టమున బాపముఁ వరూధిని దేమియుఁ దప్పులేదు. మోసముఁ జేసిన దాగంధర్వుఁడే. వాఁడుఁగూడ హరిశ్చంద్రునివంటి సత్యవాది గాఁడు. వాఁ డొక కాముకుఁడు. వరూధినిభావము నాటికిని నేటికిని యకలంకమే. కనుక నీసమయమున మనకు వస్తుతః నిందనీయురా లీ యభాగిని యచ్చర గాదు. ఇఁక చదువు సహృదయుల విషయమా ! వారికి నామనవి యే మన, మన మనుభవించునది పరబ్రహ్మానందానుభవమున కనుకరణమాత్ర మగు రసానుభూతియే గనుక నకలు గంధర్వునితోనే సరిపెట్టుకొమ్మని. ఇట్టి వాదములకు దిగినచో—వీని కంత ముండ దనిగూడ మఱియొక మనవి. పెద్దనకుఁగూడ నీసందేహము దోపకుండ లేదు, మనకున్న—యింకను మనకన్న నెక్కువగనే యాతనికి వరూధినియందు సానుభూతి కద్దు, అందులకే గంధర్వునకుఁ బ్రవరునివేషము వేయుటలోఁ దన యావచ్ఛక్తి నుపయోగించినాఁడు. కృతార్థుఁడైనాఁడు గూడ. పూర్వాపరములు తెలిసిన, గమనించిన వారికిఁదప్ప వరూధిని కీకథ తెలియనే తెలియదు. ఆమె మనసద్దమువలెనే నాటికిని నేటికిని

నున్నది. వరూధినికే లేని యీపాడు చింత మనకు మాత్ర మెందుకు? ఆమె యీతఁడే ప్రవరుఁడని తృప్తిపడినది. అసలు రసములయొక్క మేర లివియే యని కొలిచి చూచిన తపస్వు లెవ్వరు? దాని పరిమితిని దాఁక నెవరికి సాధ్యము? ఇంతకును నొక విషయమును మాత్ర మెత్తి చాటినాఁడు పితామహుఁడు. సంగమకాలమున నెట్టి భావము లుండునో, తదనుగుణముగనే సంతానము గలుగు ననుట శాస్త్రసిద్ధము. ఈ సూత్రము ననుస రించి యొక మహారాజునకు దౌర్భాగ్యదామోదరుఁడును, నిరు పేదకు శ్రీమంతుఁడును, మూర్ఖునకు గవిరాజును, చచ్చుపెద్దమ్మకు వీరాధివీరుఁడును జనింపవచ్చును. జర్మనీదేశమున నిటీవల చావునకు సిద్ధపడియున్న యొక యావు నంతకుముందే చావునకు మొగము వాచియుండిన యొక యెద్దుచే దాటించిరి. ఒక వృషభ రాజమును మాత్రము వీని కెదురుగ నాసమయమున నుంచి యుండిరి. ఈ యావునకు గొంతకాలమునకు పరమేశ్వరుని నందివంటి కోడె పుట్టినది!

సంగమకాలమున విశ్వామిత్రుఁడు ధుమధుమ లాడి యుండినను, మేనక తైతెక్కల మీఁదనే ధ్యాన ముంచియుండి నను, శకుంతల దుష్యంతుని రాయిగా శపించి తల్లినిజేరి జయంత నలకూబరుల పంచలలోఁ బడియుండెడిదే! ఇట్టిపరిస్థితు లలో భరతుఁడు పుట్టెక్కి! భరతఖండము నున్న!

వరూధినికి మన ప్రవరాఖ్యుఁడు లొంగియుండిన, ఖైమా అంగళ్లు, గోవధాలయములు, బీర్ షాపులు, కాఫీహోటళ్లు మున్నగువానిచే సూది మోప సందులేకుండ మన యార్యావర్తము కొన్ని శతాబ్దముల క్రితమే కిటకిట లాడియుండెడిది! గంగానది యెడారిగా మాఱియుండెడిది. ఆనాటి యాదర్శ బ్రాహ్మణుఁ డీనాటి బ్రాహ్మణుండైన నీనాటి బ్రాహ్మణుఁ డేనాటి బ్రాహ్మణుఁడై యుండెడివాఁడో! ఆ దుర్నిరీక్ష్య తేజోవిరాజిత మూర్తిని, ఆ తపస్సంపన్నుని, ఆ అతిథి పూజాధురంధరుని, ఆ యశేష శేముషీధురంధరుని, ఆ పరనారీ సహోదరుని, ఆ యఖిల విద్యాపారంగతుని ఆ జననీజనక పాదార్చకుని కౌపీనమునకును వరూధిని "మఖమల్ లేస్" పైట కొంగునకును ముడివెట్టి శయ్యాగృహములోనికిఁ బంపి పడకపాటలను బాడ మన యాలంకారికులు ప్రయత్నించుచున్నారే? పెద్దనమహాకవి సర్వప్రకృతిరహస్యములను జక్కఁగ నెఱింగినవాఁడు. అందువల్లనే ప్రవరాఖ్యుని శీలమును బోషించెను. ఆతని కులస్థాన పౌరుషములను గాపాడెను.

వరూధిని మనోహారిణియగు ముద్దరాలు, అమాయికురాలు, దైవభక్తిసంపన్న, స్నిగ్ధమోహావేశపరవశ, సంఫుల్ల సుమచయసౌరభవాసిత మరుత్కల్లోలితకుంతల, అఖిలాప్సరోంగనారాజ్ఞి ఇంతకుఁ బ్రాణము గల బంగారుబొమ్మ. యౌవనవిలాసములు తుత్తర తుత్తరగఁ బొంగి పొరలు

చుండెను. పెద్దన్న ప్రవరాఖ్యునిచేఁ జెలియలికట్ట వేయించి నాఁడు! పాపము! వరూథిని ప్రవరాఖ్యుని ప్రేమించినటులనే యొకగంధర్వుఁడు వరూథినిని ప్రేమించియుండెను. స్వార్థము దానిని స్వార్థమువానితోనే కలపినాఁడు. సమయము చిక్కినది వదలలేదు. సరి! సరి సరిగా గంధర్వునకు పెద్దన రాచారిచీటి నిచ్చినాఁడు. గంధర్వుఁడు నాల్గుగంతులలోఁ బ్రవరాఖ్య రూపమున వచ్చిపడినాఁడు. అసలు ప్రవరాఖ్యునితో వరూథిని హృదయము నిండి పొంగిపోవుచున్న సమయమున నకలు ప్రవ రాఖ్యుఁడు హాజరు! ఇంకేమికోఁత! ప్రకృతితత్త్వశాస్త్ర మర్మముల ఘోషించుటకు దగినయదను. పెద్దన దీనిని జార విడుచునా? గంధర్వుఁడు మన్వంతరపు ఢంకాను బజాయించి నాఁడు! విశ్వామిత్రుఁడు భరతఖండపు బాకా ఊదలేదా? ఈ పరమరహస్యములను సునిశితముగ లోకమునకుఁ జాటినవారు కాళిదాసు, పెద్దన! ఔరా! తాళిలేని యప్సరసల సంతతివారు భరతఖండమును, మన్వంతరములను స్థాపింపఁ గల్గిరి! పరమా శ్చర్యముగదా!

ఇఁక నైన రసికులమగు మనము—శుష్కములగు విచారములతోఁ బ్రొద్దు పుచ్చుటకంటె—యామహామహుఁ డేర్పాటుచేసిన విందు నారగించి యానందించుట మంచిది. వరూథిని యమృత కళిక. మనజీవితములో, మనతలఁపులలో నామెమూర్తి చొచ్చుకొనిపోయినది. రాయలకాలము నొక్క

సారి ధ్యానించి నంతనే భావనా నేత్రముల యెదుట నిలుచునదా జ్యోతిర్మూర్తియే. కవిత నిజముగఁ గలదైనచో వరూధిని సత్యస్వరూపిణి. కవిత సత్యమైనచో నామె కల.

వరూధినిహృదయమున రససముద్ర మున్నది. చూపులలో విచ్చిల గులాబీలతావు లున్నవి. మాటలలో కవిత యున్నది. ప్రకృతియొక్క విచికిలస్వరూపము వరూధిని. ప్రవరునివంటి పెద్దన......తనపూర్వజన్మ పాపప్రాయశ్చిత్తమున కామె విషాదగాథను గానముచేసె నేమో! నిజముగ నాంధ్రులు వరూధినిని బూజింపలేకున్నచో వారి సరసత జంభప్రచేష్ట. వరూధినీచిత్రమును సృష్టించిన కవి ధన్యుఁడు. జన్మమంతయుఁ జదివి యానందించు మనము ధన్యతరులముగామా!

—

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.